ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్

కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,

రాజమహేంద్రవరం - 533101.

# శ్రీ మద్భాగవత మహాత్మ్యం

- బోయనపల్లి వేంకటాచార్య ప్రణీతం

వాణీ ప్రచురణలు నెం. 4



# శ్రీమద్భాగవత మాహాత్మ్యము

( బోయనపల్లి వేంకటాచార్య ప్రణీతము )

సంపాదకుడు

**కపిలవాయి లింగమూర్తి**

తిరుమల తిరుపతి దేవస్థానము వారి ఆర్థిక సహాయముతో
ముద్రింపబడినది.

# నివేదన

కవి చరిత్రకారుల దృష్టికెక్కని కవులు తెలంగాణమున, అందును సంస్థానములు వెలసినవి కనుక పాలమూరు మండలమున నెక్కువ. అట్టివారు రచించిన యముద్రిత శాస్త్రములు, కావ్యములు, లఘుకావ్యములు శతకము లీ ప్రాంతమున వారి బంధువులింట మరియు పరిచయస్థు లింటనెన్నియో మ్రగ్గుచున్నవి. కనుక వానిని జాడలరసి సేకరించి ప్రతి కవి రచనలో మేలైన దాని నెన్నికచేసి ముద్రించిన యెడల మన భాషకు, విజ్ఞానమునకు మరియు సంస్కృతికి నెంతయో యుపకారము జరుగును. ఇది సాహిత్య అకాడమీ వంటి సంస్థలు జేయవలసిన పని.

పురాతన గ్రంథాన్వేషణమున నాకు లభించిన యముద్రితములకు కొన్నిటికైన వెలుగు జూపదలచి తొలి ప్రయత్నముగా చూతపురీ విలాసమును శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి కంపితిని. అది వారియామోదమందినది. దాని పిమ్మట నిది రెండవది. ఇటులే మరుగుపడిన వానిని వెలికి దీయవలెనని కోరిక.

హిందూ ధర్మోద్ధరణకై ధార్మిక గ్రంథ ప్రచురణ చేపట్టి శ్రీ తిరుమల తిరుపతివారు ప్రాచీన గ్రంథములకు చేయుచున్న ఆర్థిక సహాయము చరిత్ర విస్మరింపరానిది. కనుక దీని ముద్రణ కార్థికసహాయము చేసిన ఆ దేవస్థానము వారికి మొదట కృతజ్ఞతాంజలులు ఘటించుచున్నాను.

నూతన గ్రంథరచనకంటె అముద్రిత గ్రంథ పరిష్కరణ కష్టము. సాధు పాఠముల విషయమున చరిత్ర విషయమున నెన్నియో కోశములను మరియు మిత్రులను సంప్రదించవలసి యుండును. కావున నాకు సర్వావస్థల యందు తోడ్పడుచున్న ఆత్మీయులు శ్రీ రంగాచార్య గారికి.

కృతజ్ఞతలు తెలుపుకుంటూ నాకు వ్రాతకు ముద్రణ వ్యవహారమునకు చేదోడు వాదోడుగా నున్న మా చిరంజీవులు కిశోరుబాబు అశోకుబాబులను ఆశీర్వదిస్తున్నాను.

సంపాదకుడు

# వి ష య సూ చి క

# సంకీర్తనము

ఈ కవి శ్రీ వైష్ణవ బ్రాహ్మణుడు. విశిష్టాద్వైత సంప్రదాయకుడు. వీరు కౌండిన్యస గోత్రులు ఆపస్తంబ సూత్రులు. వీరి యింటి పేరు భోజనపల్లెవారు. ఈ ప్రాంతమున వీరును మరియు వీరి బంధువర్గమంతయు కవులు. ఆంధ్ర పూర్ణాచార్యులు వీరి యన్వయ కూటస్థులని సంస్కృతమున[1] ప్రసన్నామృతమును రచించిన వారి వంశీయులే నని గోలకొండ కవుల సంచికయందు శ్రీ సురవరము వారు తెలిపిరి.

శ్రీవైష్ణవము రంగమున కాలుమోపిన పిదప తత్ప్రచారార్థము కంచి మరియు తదితర ప్రాంతముల నుండి యాజ్ఞాడి, కందాళ, తిరుమల, భట్టరు మున్నగు వైష్ణవ బ్రాహ్మణ కుటుంబములు ఆకహారి, తిరునగరి మున్నగు వంటి కుటుంబములు తెలంగాణమునకు వచ్చెను. అట్టి వానిలో వీరి కుటుంబ మొకటి. వీరి పూర్వుల నివాసము నేటి మైసూరు మండలమందలి "బిజనపాల"యను గ్రామము. అచటి నుండి యొకశాఖ పూర్వము నేటి నాగర్‌కర్నూలు తాలూకా లోని [9]"బిజ్జనపల్లెకు" వచ్చెను. అనంతర మచటి నుండి వారు వేరు వేరు ప్రాంతములకు వ్యాపించిరి. ఈ కవిగారి కుటుంబము ప్రస్తుత మాత్మకూరు తాలూకా యందమర చింతలో నున్నది.

బిజ్జనపల్లె నేడు నాగర్ కర్నూలు తాలూకాలో వట్టెము పిమ్మట చెప్పదగిన చారిత్రక గ్రామము. గోన గన్నయరెడ్డి [8]వర్ధమాన పురమును పాలించినట్లు దెలుపు శాసనము రాయచూరు కోటయందు దప్ప నీ ప్రాంతమున మరెచ్చటను లేదు. అతని యితర శాసనములు గూడ లేవు గాని నేడీ గ్రామమున నతనిని బేర్కొను చిన్న శాసనమొకటి యూరి వెలుపల శివాలయము చెంత నొక రాతి కడిపై చెక్కబడి యున్నది. అది యే గ్రామ ప్రత్యేకత.

ఇతని తలిదండ్రులు నరసమాంబా కృష్ణమాచార్యులను దంపతులు. వారికీ కవిగారు క్రీ.శ. 1869 మన్మథ వైశాఖ శుద్ధ సప్తమినాడు జనించి మరల మన్మథయందే శ్రావణ బహుళ పాడ్యమినాడు పరమ పదించెను.

ఆయన బాల్యము బిజ్జన పల్లె యందే గడచెను. అతని విద్యా గురువు [3]పెద్రాల వేంకటా చార్యులవారు. దీక్షాగురువు బంగారు భావనా చార్యుల వారు. [4]చింతామణి యామునాచార్య నరసింహాచార్య సోదరులితని సతీర్థ్యులు. యాముని కృష్ణ కవులీతని జంట కవులు. వీరి సతీమణి పేరు లక్ష్మీనరసమ్మగారు. వీరికి కృతి సంతానమేగాని క్షితిసంతానము గలుగలేదు.

## వేంకటాచార్యుల కృతులు :-

చరిత్రకు తెలిసినంతవరకు వీరి ప్రథమ కృతి "జానకీ పరిణయము" అది మూడాశ్వసముల లఘు ప్రబంధము. అందలి కవిత ప్రౌఢము మరియు సరసమై యుండును. దానిని వారు యామునా చార్యులతో గలిసి రచించి సుంకర రామయ్య పల్లె వడుగ రామిరెడ్డి గారి కంకిత మీయగా క్రీ శ. 1921 లో దాసు కేశవరావు పంతులుగారు బెజవాడ వాణీ ముద్రాక్షర శాలలో అచ్చువేసిరి.

రెండవది "రాజలేఖ"యను ఖండ కావ్యము అందలి యితివృత్తము సాంఘికము వీరి కాలమునాటికి కన్యాశుల్కములే గాని వర శుల్కములు లేవు గనుక వీరందా దురాచారమును ఖండించి స్త్రీ స్వాతంత్ర్యమును ప్రబోధించిరి. దీని నీ మండలమందలి తొలి ఖండ కావ్యముగా గూడ గుర్తింప వచ్చును. ఇది వీరు జ్ఞాతి సోదరుడగు [5]కృష్ణమాచార్యులతో గలిసి రచించిరి. అది దోమకొండ సంస్థానాధిపతులు రాజా వేంకటేశ్వరరావు బహద్దురు గారి ద్రవ్య సహాయమున క్రీ.శ. 1926 వస్టు వసంబరున నోంకార ముద్రాక్షర శాలయందచ్చైనది.

మూడవది శ్రీమదాంధ్ర సత్యనారాయణ వ్రతము. పద్య రూపమైన లఘు ప్రబంధము. దానినితడు సకలాంధ్ర లోకోపకారముగా రచించితినని చెప్పెను. అందు సత్యనారాయణ పూజా విధానము మరియు వ్రత కథలున్నవి. క్రీ.శ 1929 యందు ముద్రింప బడినది.[10]

నాల్గవది "రామపూజా విధానము" గుండేరావు హర్కారేగారి సంస్కృత కృతి కనువాదము. దానియందు శ్రీరామ వ్రత మహాత్మ్యము "నరహరి భట్ట"ను విప్రునకు నారదుడు జెప్పును. ఈ గ్రంథమున పూర్వ భాగమున గుండేరావుగారి శ్లోకములకు పద్యానువాదము. ఉత్తర భాగమున వానికి వచన రూపమున్నవి. దీనిని గూడ యామునా చార్యులతోనే గలిసి రచించెను. కృతి ముఖపత్రమున నీ క్రింది శ్లోకమున్నది.

శ్రీమత్పదే శ్రితవతాం సరోజే
గుం జన్య దివ్యాదరవ వర్ధ నాయ
గద్వాల గేహృన్మమ కేశవస్య
గాడ్దే స లక్ష్మి శ్రయతే విరాజే

అందు శ్రీ గీతలుగల యక్షరములు పెద్దవిగా గూర్చబడినవి. వానిని చంద్ర రేఖా క్రమమున జదివిన యెడల "గుండేరాయ" అను పేరు, "ఆదిలక్ష్మి వివర్ధతాం" అను నాశీస్సు వచ్చును. ఇది గద్వాల రాణి ఆది లక్ష్మిదేవమ్మగారు క్రీ.శ. 1930 లో నచటి లక్ష్మి ప్రెస్సున నచ్చు వేయించినది.

ఇవి గాక రామాశ్వ మేధము భాగవత మహాత్మ్యము వీరి యముద్రిత రచనలుగా నున్నవి ఇంకను నేవేవి గలవేమో పరిశోధింపవలెను. రామాశ్వ మేధము సంస్కృతమున కనువాదము కవిగారు దాని విరువది నాలుగు సర్గలవరకే యనువదించిరట. తక్కిన గ్రంధ మెంతయో దెలియదు దానిప్రతి సీతారాంబాగు లైబ్రరీ యందున్నట్లు దెలియు చున్నది భాగవత మహాత్మ్యము ప్రస్తుతము నేమ మీ కందించుచున్నాను ఇది నాకు మిత్రులు మంగునూరి నివాసియగు శ్రీ వెలుదండ రామేశ్వరరావు గారి గ్రంధ సంచయము నుండి లభించినది. వారీ ప్రాంతమున భాషా సేవకులై ప్రాచీన గ్రంథములను రక్షించుటేగాక చక్కని కవులు విమర్శకులు మరియు వక్తలుగా గూడ నున్నారు.

## కృ తి ప్రే ర ణ :-

సాధారణముగా కవులేదో యొక ప్రేరణలేక, సంఘమునకు తామేదో చెప్పదలచక కలము బట్టరు ఇది మనకు నన్నయగారి నుండి యున్న యాన వాయితి. మా జిల్లా యందొకప్పుడు శ్రీరామ సామ్రాజ్య పట్టాభి షేకములు, భాగవత సప్తాహములు మరియు నితర యుత్సవములు పెక్కు జరిగినవి. వానిలో

*క్రీ. శ. 1866 అక్షయ మాఘము*

కోమటికుంట యందర్థము చెల్లయ్యగారు చేయించిన లక్ష బిల్వార్చన.

*క్రీ. శ. 1882 చిత్రభాను వైశాఖము*

కొండారెడ్డిపల్లెయందు రాఘవరావు మక్తేదారుగారు చేయించిన సప్తాహము.

*క్రీ. శ. 1913 ఆనంద*

యాపర్లలో గోవింద నాయకుగారు జేయించిన సామ్రాజ్య పట్టాభిషేకము.

*క్రీ. శ 1920 దుర్మతి వైశాఖము*

నాగర్‌కర్నూలులో సబ్ డివిజనల్ ఆఫీసర్ వేంకటరమణయ్యగారు జేయించిన సప్తాహము.

*క్రీ. శ. 1924 రక్తాక్షి వైశాఖము*

తిమ్మాజిపేటయందు బచ్చు చెన్న కిష్టయ్యగారు జేయించిన సప్తాహము.

*క్రీ. శ. 1927 ప్రభవ మార్గశిరము*

హైదరాబాదున తాతాజీ కృష్ణాజీ నాయక్‌గారు జేయించిన భాగవత సప్తాహము.

*క్రీ. శ. 1929 శుక్ల వైశాఖము*

జినుకుంటయందు బిలుమూరు వరదాచార్యులవారు జేయించిన సామ్రాజ్య పట్టాభిషేకము.

*క్రీ. శ. 1935 భవ వైశాఖము*

ఎండవెల్లియందు పకీరయ్యగారు జేయించిన పెద్ద సప్తాహము.

చెప్పదగినవై చుట్టుపట్ల జనుల నాకర్షించి వస్తు సమృద్ధితో వారము దినములు సలక్షణముగా నడచి ప్రజలపై తమ చెరగని ముద్ర వేసినవి. ఈ సందర్భము లందు పదసాహిత్యము గూడ యెంతో ప్రభవించినది. కొండారెడ్డిపల్లె రాఘవరావు గారు తమ సప్తాహమున 'బంగారు శాస్త్రిగారితో సప్తాహ మాహాత్మ్యము రచింపించి ముద్రింపించి పంచిరి. ఆవంచయందు శ్రీరామనవమికి కలువకుర్తి నారాయణాధ్వరిగారు రామోపాసనా పద్ధతి రచించి ముద్రింపించిరి. వారు రామ సముద్రమున మునిగి తేలినవారు గనుక నాటివారు రామోపాసనలందు నారాయణాధ్వరిగారి కృతి సామ్రాజ్య పట్టాభిషేకములందు గోవింద నాయకుగారి సప్తాహము సాటి లేనివని పొగిడిరి. తాతాజీగారు వావిళ్ళవారి భాగవతములు గాని ముఖ వ్రతమున సప్తాహ వివరములు ముద్రింపించి పంచిరి. తిమ్మాజి పేటవారు

7గంగవరము నరసింహాచార్యులతో సప్తాహ మాహాత్మ్యమును నాటకముగా వ్రాయించిరి. ఇటులీ యుత్సవము లానాడు సాహిత్య సేవ మరియు కొంత సాహిత్య సృష్టి గూడ జేసినవి.

పై వానిలో గోవిందనాయకు మరియు తాతాజీ గారల సప్తాహములు ప్రత్యేకముగా జెప్పదగినవి. యాపర్ల సప్తాహము కృష్ణా తీరమున పదునది దినములు జరిగెను. అందు నూటెనిమిది మంది రామాయణ పారాయణములు జేసిరి. సప్తాహము జరిగినన్ని దినములు ముప్పది నలుబది పురోహితు లింకొకవైపు రుద్ర యాగము మరియు రామకోటి జపము జేసిరి. ఆ సప్తాహమున వెల్లాల సదాశివశాస్త్రి గోపాలపేట రామచంద్రశాస్త్రి, పల్లా రామశాస్త్రి వెంకుశాస్త్రి, అచ్చంపేట నరసింగయ్య శాస్త్రి యాపర్ల లక్ష్మీ నరసింహయ్యశాస్త్రి ఖండవల్లి నరసింహశాస్త్రి ఆచార్ల రాఘవాచార్లు రంగాచార్లు, నంబాకం రాఘవాచార్లు, కంఠీరవాచార్లు మొదలైన పాలమూరి విద్వాంసులగు పండిత వర్గ మంతయు పాల్గొనెను. అచ్యుతస్వామి గారు ప్రద్రష్టలుగా నుండిరి, పిక్రాల వేంకటాచార్యులవారు పురాణము జెప్పిరి. నాడు పెద్దమందడి నివాసి అర్చకం అయ్యాహ చార్యులవారు పిక్రాల వేంకటాచార్యులవారు పురాణ ప్రవచనమున సాటిలేనివారు.

తాతాజీ కృష్ణాజీగారు జేయించిన సప్తాహము గొలిగూడాలో తమ సొంత యింటియందే జేయించిరి. దానికి బుఱ్ఱను అప్పన్నశాస్త్రి గారు ప్రద్రష్టగా ర్యాలి సీతారామశాస్త్రిగారు కార్య నిర్వాహకులుగా వ్యవహరించిరి. దానియందు గూడా నీ జిల్లా యందలి పండితులు పాల్గొనిరి, తాతాజీ వృద్ధుడై యనారోగ్యముగా నుండెను గనుక సప్తాహ మారంభించిన మూడవనాటికి దశ విషమించెను. అది జూచి కార్యనిర్వాహకుడు భాగవతము నేడే పూర్తి గావలెనని చెప్పెను. అంత పారాయణ కర్తలు తలా కొన్ని అధ్యాయములు పంచుకొని సాయంకాలము వరకు పూర్తిజేసిరి. భాగవతము పూర్తియైన దన్న మాటవిని ఆయన పరీక్షితునివలె క్షేమమాయెను అపుడది దర్శింప నేగిన వారాగునేమో యనుకొనిరట గాని వీరభద్రుడు దక్షుని తల దీసినంత మాత్రమున నా యాగమాగెనా! వామనుడు బలిని బంధించగా క్రతువాగెనా? దానిని గోవింద నాయకుగారే ముందునకు వచ్చి సమీపమందలి రామమందిరమునకు మార్చి యథావిధిగా నిర్వహించెను. ఈ సప్తాహమున భాగవతము మూడవ నాటికే ముగిసెను గనుక నాల్గవ నాటినుండి దాని స్థానమున వివిధ పురాణములు పారాయణము జేసిరి. ఆ సప్తాహము జూచిన

వారికీ కావ్యమందలి తృతీయాశ్వాసమున దాని ఛాయలు గోచరించును. దీని పిమ్మట దేహాతున యిట్టివి పెక్కు జరిగినవి.

## భాగవత సప్తాహము :-

మహబూబ్‌నగర్ జిల్లా యందీ సప్తాహమునకు శ్రీకారము జుట్టినవాడు వెదిరె గ్రామమందలి శివరామయ్య యను స్మార్తుడు అతడు. తమ గ్రామ సమీప మందలి గుట్టపై నివసించి నూటెనిమిది పర్యాయములు భాగవత పారాయణము జేసెను అంత నతనికి చివరిసారి నారదుడు ప్రత్యక్షమై తారకమంత్ర ముపదేశించి భక్తి జ్ఞాన వైరాగ్య తత్వ ముక్తి మార్గములకు భాగవతము కూడలి గనుక దాని పారాయణ సప్తాహములను ప్రచారము సేయుమని యాదేశించెను. ఆ యాదేశమున శివరామయ్య శివరామ దీక్షితుడై యొక పీఠమును స్థాపించి యది చివరి దినములందు తమ బావగారగు కోట కదిర రాజయ్యగారి కప్పగించెను. రాజయ్య శివరామ దీక్షితులతో నుపదేశమంది రాజయోగియై తన చివరి దినములలో దానిని మేనల్లుడగు చందన్న కప్పగించెను. చందన్న యది తన హయాముస బిజ్జనపల్లెకు గొనివచ్చి యచట గల యొక గుట్టకానందగిరి యని నామకరణము జేసి యా పీఠమును దానిపై స్థాపించెను. నేడా పీఠము బిజ్జనపల్లెలో నతని సమాధి కోట కదిరిలో నున్నవి. సమాధి యతని సోదరి చంద్రభాగమ్మగారు చక్కగా కట్టించి యన్న యారంభించిన సప్తాహ సంప్రదాయమును పోకుండ నిలిపినది. నేడామె కుమారులు దానిని సాగించు చున్నారు.

బిజ్జన పల్లెలో నానందగిరి పీఠస్థాపన, భాగవత సప్తాహ ప్రారంభము మున్నగు సంఘటనతో కవిగారి హయాముననే జరిగినవి. ఈ గ్రామమున నాటి పత్రివారను మరియొక వైష్ణవ కుటుంబ ముండెను. వారిని మరియు నీ భోజనపల్లి వారి భూములచట ప్రక్క ప్రక్కనే యుండెను. కాలాంతరమున నీ రెండు కుటుంబముల వారాత్మకూరు సంస్థానమునకే వెళ్ళిరి అయినను భూములకై యపుడపుడు వచ్చుచుండిరి. నేడచటి యున్నత పాఠశాల వీరి భూమియందే యున్నదట-కనుక నచటి యానందగిరి పీఠస్థాపన దీనినొక ప్రేరకము గావచ్చును. అటుల గాకున్నను బిజ్జనపల్లి యందలి చంద్రమౌళీశ్వర స్వామి వారి యానందగిరి పీఠస్థాపనము ఆత్మకూరి యందే వేంకటాచార్యుల వారి భాగవత మాహాత్మ్య రచనము దాదాపు సమకాలికముగనే యుండును.

# 2. కథాశ్రవణము

ప్రవేశిక :- పరలోకమున కీశ్వరు దధికారి. ఇహలోక మునకు మానవు దధికారి. ఇది నేటినరుల సగటునమ్మిక. పునర్జన్మ నంగీకరించినను లేకున్నను పాప పుణ్యములు పరలోకమందు వానికి దగిన శిక్షలు సౌకర్యములు ఏ మతము వారివి వారికున్నవి. ప్రకృతి శాస్త్రమునకు పాశ్చాత్యులవలె పారమార్థిక విషయమున హిందువులదే యందెవేసిన చేయి గనుక నె దావిషయమున వారి సిద్ధాంతములే మిక్కిలిగా శిరోధార్యము లగుచున్నవి.

ప్రపంచమున నన్యమతముల వా రిహభోగాను భవములకే బ్రదుక హిందువైన వాడీలోకము కొరకుగాక పరలోకమునకై బ్రదుకును. అది వాని జీవ లక్షణము. పరలోకమున కతనికి పెక్కు మార్గములున్నవి. అందు కర్మ జ్ఞాన భక్తి మార్గములు ప్రసిద్ధమైనవి.

శాస్త్రమున జ్ఞానయోగమునకు వామదేవ భక్తియోగమునకు శుకమార్గములని వ్యవహారము. చెట్టు కొనకొమ్మన గల పండును దినుటకు చీమయైనచో ప్రాని మొదటి నుండి ప్రాకవలెను. చిలుకయైనచో నాకాశ మార్గమున వచ్చి యదే కొమ్మపై వ్రాలును. జ్ఞాన భక్తి మార్గముల తారతమ్యము లట్టివి. మొదటి దానిచే నరుడు క్రమ ప్రాప్త ముక్తి నందగా రెండవ దానిచే సద్యోముక్తి నందునని పర్యవసానము రెంటి కొకటే యైనను జ్ఞానము భక్తిని మూఢమైనదని యంగీకరించదు. భక్తి కర్మను ప్రదర్శనాడంబరమైనదని తృణీకరించును.

భాట్టులు యజ్ఞ యాగాది వేదచోదిత కర్మలే ముక్తిసాధనమనగా శాంకరులు జ్ఞానములేక నూరు జన్మలకైన ముక్తి లేదందురు. ఇక సామాన్య లాగొడవలలో బడక భక్తి గలిగిన చాలును భగవత్పద మందవచ్చునని నమ్ముదురు. కనుక పరస్పర విరుద్ధములైన యీ సిద్ధాంతములను సమన్వ యించుటకు భగవద్గీతాది వేదాంత శాస్త్రములు లెస్సగా ప్రయత్నించినవి. అంతేగాక నా యాకాలము లందు దయించిన మహనీయులు గూడ నందులకు కృషిజేసిరి. మతత్రయ కర్తలందాద్యులైన యాచార్య శంకరు లారుమతముల నంగీకరించి షణ్మత స్థాపకులైనను

జ్ఞానములేని భక్తి నంగీకరింప లేదు. అందువలన నతని పిమ్మట వచ్చిన భగవద్రామానుజులది యంగీకరించి భక్తి సహాయములేక కేవల జ్ఞానముచే ముక్తి దుర్లభమని సిద్ధాంతీకరించి యుభయ వేదాంత ప్రవర్తకు డయ్యెను.

పై మార్గములలో సామాన్యునకు కర్మజ్ఞానము లకంటె భక్తియే చేయువ దానికి భాగవత మాటపట్టు. అది భక్తిని నవవిధములుగా వింగడించి వివరించినది. అనంతరము వానిని పురాణములు కీర్తించి వాని వాని ప్రశస్తిని వస్తురూపమున ప్రకటించినవి.

తీర్థ క్షేత్ర వస్తు సంబంధ మహాత్యములకు స్కాంధమొక కంధి. ఇది యా కంధిలోనే బుట్టిన యొక రత్నరాజము. ఇందు భక్తిదేవికథ ధుంధుకారి వృత్తాంతమను రెండు కథలున్నవి. భక్తిదేవికథ ప్రబోధ చంద్రోదయమువలె మానవ భావములను పాత్రలుగాజేసి కల్పించ బడగా ధుంధుకారి వృత్తాంతము మానవ జీవిత ప్రతిబింబముగా సృజించబడినది.

## మొదటి కథ

భక్తిదేవి పరమాత్మ సంకల్ప సంభవ; శ్రీహరికి ప్రియురాలై వైకుంఠ మున పెద్దకాలము కాపురముజేసి, జ్ఞాన వైరాగ్యములను కుమారులను గని కొంత కాలమునకు తనను తామరచి పరమాత్మ చెంతకువెళ్ళి ''నేనేమి జేయవలె?'' నని యడుగ నతడింతటిమండి నీవు నా భక్తులను రక్షించు చుండుమని, ముక్తికాంతను దాసిగానిచ్చి భూలోకమున కంపెను. అపుడామె సుతులతో దాసితో ద్రావిడ భూమిలో పుట్టి. దేశాటనము జేయుచు. కర్ణాటమున పుష్టినంది, మరాటయందు వన్నెదేరి, ఘూర్జరమున కుంటువడెను.

ఆమె కుమారులైన జ్ఞాన వైరాగ్యములను కృతాది యుగత్రయమున పోషించిరిగాని కలిలో నడుగువారు లేక కృశించి యకాల జరాభారమందిరి ముక్తి కాంత గూడ నటులే యయ్యెను. అది జూచి యామె దాసిని మరల వైకుంఠము నకే వెళ్ళుమని బంపి, కుమారులతో నెట్లెట్లో బృందావనము జేర, నా వాతావరణ మున తనకు కొంత క్రొత్తజవము కలిగెను కాని కుమారులు మాత్రమటులే యుండిరి గాన శోకవాడు యమునా తీరమున పుత్రుల స్థితి దలచుకొని దుఃఖించు చుండ మార్గవశమున నటకేతెంచిన నారదుడామెను నీవెవ్వరు? యెందుల కేడ్చు

చున్నావని యడిగెను. అంత నామె తనగోడు జెప్పుకొని జరా మూర్ఛితులైన పుత్రుల జూపి వారి బాగున కుపాయము జెప్పుమని కోరెను. అప్పుడు నారదుడు నిమీలితుడై యామె భవిష్యత్తును పరికించి "పరీక్షితుడు ధర్మ దేవతను దర్శిన కలిపురుషుని విగ్రహించియు మరల ననుగ్రహించి యీ లోకమున నిలిపెను గనుక నే డెటు జూచిన నతని ప్రభావమే చెల్లుచున్నది. నీవెచ్చటికి వెళ్ళినను నిన్నెవరు బలుకరించరు. ఇచటనే యున్న వీరికి విద్రా సుఖమైన దక్కునుగనుక దేశాటన కాంక్ష విడువుమని జెప్పి, ఆమె ప్రార్థనపై వారిని మూర్ఛ దేర్చుటావి చేతులతో నిమురుచు చెవులలో గట్టిగా మేలుకొనుడని ప్రబోధించెను. ఆ ధ్వనికి వారా యాసమున కన్నులు దెరిచి లేవబోయి మరల చతికిలబడిరి. నారదుడా దీనావస్థకు "హరిహరీ" యను కొనెను. అపు డాకాశవాణి యతనితో నీవు వీరికై సాధు వులు జెప్పిన సత్కార్య మేదైన జేయగలిగిన బాగు పడుదురనెను. అదివిని యతడు సాధుదర్శనమున కేగి జ్ఞాన వైరాగ్యముల దశజెప్పి యెవరిని యుపాయ మడిగినను నీవె యెరుగనిది మే మేమెరుగుదు మనిరి. అతడు తిరిగి తిరిగి బదరికా వనముజేరి సనకాదుల గని నమస్కరించి జ్ఞాన వైరాగ్యముల బాగుపడు నుపాయ మడుగ వేదములు విభజించి యష్టాదశ పురాణములు రచించియు గూడ నాత్మ శాంతి నందని వ్యాసునకు నీవే భాగవతార్థోప బృంహితమగు చతుశ్శ్లోకి నుపదేశించి తాపముడిపితివిగదా! అంతకంటె నిక యెక్కువేమున్నది. దాని నతడిపుడు భాగవ తముగా రచించి శుకున కుపదేశించి నాడు నీ వా శుక శాస్త్రమును వారికి వివి పింపుమని జెప్పిరి. నారదుడు వారికి మ్రొక్కి సెలవంది వచ్చి యానంద కానన మున జ్ఞానయజ్ఞము మొదలుపెట్టి యేడుదినములు భాగవత పారాయణ జేసెను. అపుడచ్చటికి భక్తిదేవి కుమారులతో వచ్చెను వారా యేడుదినములు నారదుడు జేసిన భాగవత ప్రవచనము వినగా యథాపూర్వముగా యువకులైరి. అదిగని యటకు వచ్చిన వారాశ్చర్యపడిరి. అంత సనకాదులు వారితో యిందాశ్చర్య పడవ లసిన దేమియులేదు. భాగవత శ్రవణ ఫలమే యట్టిది. అది సకలదురిత హరము దానికి నిదర్శనమగుకథ యొకటి గలదు వినుడని యిటుల జెప్పిరి.

## రెండవ కథ

పూర్వము తుంగభద్రా తీరమందొక గ్రామమున నాత్మదేవుడను బ్రాహ్మణు డుండెను. అతని భార్యపేరు ధుంధులి. వారికి సంతానము లేకపోగా నొకనా

ఆతడు తపమునకై వెళ్ళి యొక చెట్టుక్రింద గూర్చుండ నచటి కొకయోగివచ్చెను. అతనినిగని యాత్మదేవుడు లేచి నమస్కరించి తనవిషయము జెప్పుకొని దుఃఖించ దివ్యదృష్టితో భవిష్యత్తును జూచి నీ కేడుజన్మల వరకు సంతాన యోగములేదు. అథవా కలిగినను నీకు వారితో సుఖములేదు కనుక నాకోరిక విడువుమనెను గాని యతడు వినక తనకెటులైన సంతానము ప్రసాదించుమని మంకుపట్టు బట్టెను. అంత నాయోగి యొక ఫలమిచ్చి దానిని భార్యకు దినిపించుమని చెప్పి వెళ్ళెను. ఆత్మదేవు డదిగొని యింటజేరి భార్యను బిలిచి యిచ్చి దానిని భుజింపుమని జెప్పి కార్యాంతరమున మరల నెటకో వెళ్ళెను. అటులతడు వెళ్ళగనే యామె చెలిని బిలుచుకొని చూచితివా! మీ యజమాని నాతో భోగము లనుభవించుచు కుదిరి కూర్చుండలేక సుతుల సుతులని యెక్కడికో వెళ్ళి ఈ పండు దెచ్చెను. దీనిని దినిన గర్భము నిలుచునట. కష్టపడి తొమ్మిది నెలలు కడుపుమోసి బిడ్డనుగని యౌవ్వన సుఖము పాడుజేసికొనుట కెవతె యిష్టపడును. కనుక యిపుడీ యాపద దొలగించు కొనుటెట్లని యాలోచించి, యప్పటికది యట్లుంచి భర్త యింటజేరి పండుదింటివా యని యడుగ దింటినని బొంకెను.

అటులామె బొంకిన పిమ్మట నామె యక్క చూచి పోవుటకు వచ్చెను. అపుడు ధుంధుల అక్కగారితో తనకు గలిగిన యాపద జెప్పుకొనెను. ఆమె చెల్లెలికి దగిన యక్క. అంతేగాక నప్పటికి నెలదప్పి యుండెను. గనుక మంచి సమయమునకు వచ్చితివని సంతసించి నేనిపుడు నెలదప్పి యున్నాను గాన ప్రసవము నాటికి నీకింత ధనము బంపితివా మీ బావగారు నాబిడ్డను నీకు దెచ్చి యిచ్చును. ఈ లోపల నీవు చూలాలివైనట్లు నటించి బిడ్డ జేరిన పిమ్మట ప్రసవించితినని జెప్పుము నీపతి దెచ్చినపండు మీదొడ్డిలోని యొక యావునకు దినిపింపుము దాని పాటిజాతము గాక। బిడ్డను నీకు జేర్చినపిమ్మట నేను నాకు కలిగిన కుమారుడు చనిపోయెనని ప్రవాదము గల్పించి పిమ్మట నేదోమిషతో దినదిన మిటకువచ్చి బాలునికి పాలిచ్చి పోయెదను అని యుపాయముజెప్ప వెళ్ళెను.

అక్క వెళ్ళిన పిమ్మట ధుంధుల యాపండు దొడ్డిలో నొకయావునకు బెట్టి నాటినుండి తాను చూలైనట్లు నటించి యక్క ప్రసవించు నాటికి పతికి దెలియకుండ ధనమంపి, యామెకు కలిగిన కుమారుని దెప్పించుకొని పిమ్మట తాను ప్రసవించినట్లు నటించి తనకు సుతుడు కలిగెనని పతికెరింగించెను. అది విని యాత్మదేవుడు మిన్నంది. వైభవమున సుతునకు జాతకర్మాదులు జేయించి

ధుందుకారి యని పేరుబెట్టెను. ఈ లోపల నక్కడ ధుందుల యక్కగారు తనకు కుమారుడు గలిగి చనిపోయేనని ప్రవాదు బుట్టించెను. అంత నది వ్యాపించిన పిమ్మట నొకనాడు ధుందుల పతినిజేరి నేను బిడ్డనుగంటిని గాని యెందులకో పాలు పడలేదు. పాలు లేకుండ నీవినెట్లు పాకుదును ఇపుడు మాయక్క పుట్టినబిడ్డ పోయి విడిమనిషిగా నున్నది గనుక నామెను పిలిపించిన నీవిని పాలిచ్చి పాకునని చెప్పెను. ఆత్మదేవు డదివిని వదినగారిని పిలిపించుకొని "అమ్మా ! నీ చెల్లెలు సుతునిగనెను గాని పాలులేవు. పాకుట యెరుగదు కనుక నీనిని పాలిచ్చి పెంచు భారము నీదని యప్పగించెను.

ధుందులకు బిడ్డపుట్టిన మూడునెలల కొక నాడామె పండు దినిపించిన యావు మొగబిడ్డని గనెను. అది జూచి జనులాశ్చర్యపడిరి. ఆత్మదేవుడా బాలునకు గూడ జాతకర్మాదులు వైభవమున జేయించి "గోకర్ణుడని" పేరు బెట్టెను. నాటినుండి గోకర్ణ ధుందుకారులు కలిసియే పెరిగి యువకులైరి. వారిలో గోకర్ణుడు పరమ శాంతుడుకాగా ధుందుకారి మిక్కిలి దుష్టుడు మరియు దుర్వ్యసన లంపటుడై దినదినము తలిదండ్రిని కొట్టి తిట్టి బాధించి యింటనున్న ధనకనకములు గొనివెళ్ళి జూదములకు వేశ్యలకు వెచ్చపెట్టసాగెను. అదిగని తండ్రి యొకనాడిక నేను నీనితో నేమిసేయుదు ? ఎటులేగుదు నని దుఃఖించుచుండ గోకర్ణుడు సమీపించి యోదార్చి వైరాగ్య స్వరూపము జెప్పెను. అదివిని యతడిక నాడే యిల్లువిడిచి యడవులకు వెళ్ళి భాగవత మార్గమున ముక్తినందెను.

తండ్రి యిల్లువెడలి పోయిన పిమ్మట నొకనాడు తల్లి వానిబాధలు బడలేక నూతబడి జచ్చెను. అటుల తలిదండ్రి పోగా గోకర్ణుడాయింట నుండలేక యాత్రలకు బయలుదేరెను. తమ్ముడిల్లు విడుచుట ధుందుకారికి మరింత మేలై నాటినుండి తన వారకాంతల నింటియందే యుంచుకొని యధేచ్ఛగా చరించుచు నొకనాడు రాజుగారి బొక్కసమునకు బొక్కపెట్టి యిల్లు నింపుకొని అందు కొంత తన వేశ్యల కిచ్చి యారాత్రి యలసి నిద్రింప వారతని కుత్తుక నుచ్చుబిగించి చంపి యేది యెరుగనట్లు ధనము దక్కించుకొని యిల్లు వదలి వెళ్ళిరి. పిదపవారిచే జంపబడిన ధుందుకారి ప్రేతమై యూరిపై దిరుగసాగెను. అతడు జచ్చిన సంగతి యెటులో గోకర్ణునకు దెలిసి తాను జేయు యాత్రలలో నతనికి పిండప్రదానములు జేసి యొకనాడిల్లు జూడగోరి తమ గ్రామమునకు వచ్చి యప్పటికి చీకటి బడుటచేత వాకిట చప్పరము క్రింద బండుకొనగా, ధుందుకారివచ్చి తన భీకరరూపము

జూపెను. అది గని గోకర్ణుడు పాప మిందెవరో శ్రాద్ధాదు లెరుగని యగతికుడనకొని, నీవెవరని, యడుగ వాడు మాటాడరాక మీ యన్ననని సైగచేసి ఈ ప్రేతరూపమును భరించ లేను దీని నెటులైన దొలగింపుమని దీనతను ప్రదర్శించెను అదిజూచి గోకర్ణుడు నేను నీకై గయాశ్రాద్ధము జేసితిని. దాని చేగూడ దొలగని ప్రేతత్వము మరి దేనిచే దొలగునో నీ వెఱిగిన జెప్పుమన, నా పాపమొక గయాశ్రాద్ధమున గాదు వేయింటిచే గూడ దీరదు. గనుక మరియొక మార్గాంతర మాలోచింపు మనెను. అటులారాత్రి తెల్లవారిన పిమ్మట గోకర్ణుడు రాత్రి తమ గ్రామమునకు వచ్చెనని దెలిసి పెద్ద లతనిని జూడవచ్చిరి. అతడు వారందరికి నమస్కరించి కుశల ప్రశ్నలతో పాటు రాత్రి తాను జూచిన యన్నగారి దశ దెలిపి యది దొలగు నుపాయము జెప్పుడని కోరెను. అపుడటకు వచ్చిన వారిలో బ్రహ్మవాదులు గూడ నుండిరి గాని వారు గూడ నేది జెప్పలేక పోయిరి. అంత గోకర్ణుడు సూర్యోపాస్తి జేసి యతనితో నన్నగారి ప్రేతత్వ విముక్తిని గురించి యడిగెను అపుడు సూర్యుడతని మంత్రములకు విస్మయమున స్తంభీభూతుడై నిలిచి శ్రీకృష్ణు డీలోకమును వీడునపు డుద్ధవుడు చెంతకేగి మహాత్మా! మీ రేగుచుంటిరి గనుక నిక యస్మదాదులకీ యుగమున దిక్కేది యనగా నా పరమ పురుషుడు తన తేజమును భాగవతమున నిక్షిప్తముజేసి పోయెను గనుక నీవతని ప్రేత రూప ముక్తికై యది పారాయణ జేయుమని జెప్పెను. అది విని గోకర్ణుడచట నొకచోట భాగవత సప్తాహ మారంభించెను, అపుడచ్చటికి దేవముని సిద్ధ సాధ్యాదు లందరు జూడవచ్చిరి.

అతడు సప్తాహ మారంభించిన చోట నొక పెద్ద వెదురుపొద యుండెను, ధుందుకారి తమ్ముడుజేయు దానిని జూడవచ్చి యా పొదలో నొక లావుపాటి గడలో నిలిచెను. అంత నావెదురు సప్తాహ మారంభమైన నాటినుండి సాయంకాలము పారాయణ ముగియువరకు కొక్కొక్క గణుపు చొప్పున పగులుచు చివరి నాడది ముగియగనే పెద్ద చప్పుడుతో మొత్తము పగిలి ధుందుకారి యందుండి ప్రేతరూపమును బాసి హరిరూపమును ధరించి వచ్చి తమ్మునికి సాష్టాంగపడి లేచి కౌగిలించుకొని నీ వలన నా ప్రేతత్వము దొలగెనని చెప్పి భాగవత శ్రవణము నా పాపములెల్ల నగ్ని యెండుగడ్డిని గాల్చినట్లు మొదలంట గాల్చివేసెనని దాని మహాత్మ్య మనేక విధముల బొగడెను.

# 3. సందర్శనము

పురాణ గాథలను జెప్పునప్పుడు మన శకములు జాలవు కనుక నవి స్థూలముగా నేమన్వంతరమున నేకల్పమున నే మహాయుగమున శ్రీహరి యొక్క యే యవతారవేళ జరిగెనో చెప్పుచుందురు. ఈ కథను శ్రీకృష్ణుడు గతించిన ముప్పదేండ్లకు శుకుడు పరీక్షిత్తునకు పిమ్మట వందయేండ్లకు సనకాదులు నారదునకు తదుపరి వందయేండ్లకు గోకర్ణుడన్నగారికి వినిపించెనట.

నేడు మనము కాలచక్రమున నేడవదగు వైవస్వత మన్వంతరమున శ్వేత వరాహకల్పమున నిరువది యెనిమిదవ మహా యుగమందలి కలియుగమున నున్నాము. ఈ మన్వంతరమున పురందర నాముడింద్రుడుగా నత్రి, కశ్యప, గౌతమ, జమదగ్ని భరద్వాజ, వశిష్ఠ విశ్వామిత్రులు సప్తర్షులుగా నున్నారు. నేడు మనమున్న మహా యుగముననే గడచిన త్రేతాయుగమున శ్రీరాముడు, ద్వాపరమున శ్రీకృష్ణు డవతరించిరి. శ్రీరాముడు త్రేతాయుగమున 30 వేలు మిగిలియుండగా విలంబి సంవత్సర చైత్ర శుద్ధనవమి బుధవారము పునర్వసు నక్షత్రమున మధ్యాహ్నము కటక లగ్నమున నైదు గ్రహము లుచ్చరాశి యందుండగా జనించెను. శ్రీకృష్ణుడు ద్వాపరమున (8,63,874, - 4-21) నెనిమిది లక్షల యరువది మూడు వేల యెనిమిదివందల డెబ్బదినాలుగు సంవత్సరముల నాలుగు నెలల యిరువది యొక్క దినములు గడచిన పిమ్మట క్రీ పూ 2228 శ్రీముఖ సంవత్సర శ్రావణ బహుళ నవమీవిద్ధాష్టమి నాటిరాత్రి వృషభలగ్నమున నభిజి న్ముహూర్తమున పన్నెండు గంటలవేళ జనించి (125-7-8) నూటిరువది యైదేండ్లంపై యేడు నెలల నెనిమిది దినములు బ్రతికి మరునాడు అనగా క్రీ. పూ. 3102 ప్రమాది సంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమినాడు పగలు పన్నెండు గంటలవేళ బోయవాని బాణముచే పరమ పదించెను, అతడు మరణించిన నాటినుండి యీ కలియుగము లెక్కింప బడుచున్నది.

శ్రీకృష్ణుని పిమ్మట ముప్పదేండ్లకు అనగా క్రీ. పూ. సౌమ్య సంవత్సరమున దీనిని శుకుడు పరీక్షిత్తునకు పిమ్మట నూరేండ్లకు అనగా క్రీ. పూ. 2972

విరోధి కార్తీక శుద్ధనవమినాడు సనకాదులు నారదునకు ఆ పిమ్మట వందయేండ్లకు అనగా క్రీ. పూ 2872 విభవ సంవత్సర జ్యేష్ఠ శుద్ధనవమినాడు గోకర్ణుడన్నకు వినిపించెను ఇటులిది శ్రీకృష్ణుని పిమ్మట (230) రెండువందల ముప్పదేండ్లకు ప్రచారమందు కొనెను. ఇది ప్రచారమునకు వచ్చి నేటికి అనగా కలిశకము 5082 నకు సరియగు దుర్మతి జ్యేష్ఠ శుద్ధనవమి గురువారము (11-6-1981) నాటికి (4852) నాలుగువేల యెనిమిదివందల యేబదేండ్లు దాటినవి.

## వస్తు ధ్వని :-

ఈ కథలో కల్పనతోపాటు కొంత సత్యము గూడ నున్నది. భక్తిదేవి శ్రీహరికి ప్రియురాలు జ్ఞాన వైరాగ్యము లామె కుమారులు ముక్తికాంత వారి దాసి యని చెప్పుటచే భక్తి యున్నచాలును శ్రీహరి యతనికి భార్యకు భర్తవలె యేడు గడమై నిలచును. జ్ఞాన వైరాగ్యముల కతడిక వేరుగా యత్నించ నక్కరలేదు. అవి భక్తిచేతనె గలుగును. ముక్తిగూడ అంతియే భక్తుడు కోరినచాలును లభించును.

అంతేగాక భక్తి శ్రీహరికి ప్రియురాలనుటచే నందు నవ విధము లున్నను గోపిక లనుసరించిన మార్గ ముత్తమమని సూచన. గోదాదేవి శ్రీరంగని పొందుటకా మార్గమునే యనుసరించెను.

కృత త్రేత ద్వాపరములందే గాని కలియుగమున జ్ఞాన వైరాగ్యముల దలకరించు వారలేరు. కలియుగమున భక్తి ద్రావిడ దేశమున బుట్టి, కన్నడమున పుష్టినంది మహారాష్ట్రమున మెరుగెక్కినది గాని ఘూర్జరమున కుంటువడినది. బృందావనాది యాత్రలతో భక్తికేగాని జ్ఞాన వైరాగ్యములకు పుష్టిలేదు. వానికి భాగవత శ్రవణమున దప్ప నారద ప్రబోధమువలన గూడ లాభములేదు. ఇది మొదటి కథ యందలి నీతి.

కుపుత్రత్వముకంటె యపుత్రత్వము మేలు. ఎంత ఘోరపాపమైనను భాగవత శ్రవణము వలన నశించును ఇది రెండవ కథలందలి విషయము.

## వింతలు:-

పురాణ కథలందు సాధారణముగా వింతలకు కొదువ యుండదు. ఇందు ఫలశ్రుతణచే సంతతి గలుగుట, గోవునకు మానవశిశువు గలుగుట, గోకర్ణుని మంత్రములకు సూర్యుడు విలుచుట ధుంధుకారి ప్రేతరూపము బాయుట యట్టివి

"అపుత్రస్య గతిర్నాస్తి"యని హిందువుల నమ్మకము గనుక వారు సంతానమునకై బడని పాటుండదు. జల ఫల మూలికాదుల ద్రవ్య గుణముచే ప్రభావము గలది గాబట్టి ఆ యా పరిస్థితుల ననుసరించి యది సంతానమునకు దోహదము లగునని విశ్వసింప వచ్చును గాని పశువునకు శిశువుగలుగుట వింత.

డార్విన్ మహాశయుని సిద్ధాంత రీతిగా జంతుజాతి నుండే మానవ పరిణామము గలిగినదని నేటి ప్రపంచమున మానవులకు జంతువులు జంతువులకు మానవులు గలుగుటలేదు గాని పురాణము లందది సామాన్యమే అందు జంతువులకు బుట్టిన వారిచే వర్ధిల్లిన వంశములు గూడ నున్నవి. ఋష్య శృంగుడు జింకకు, క్రోష్టి నక్కకు, మహిషుడు గేదెకు మాండవ్యుడు కప్పకు, మత్స్య వల్లభుడు మొసలికి భారత వంశమునకు కుమార్తైన మత్స్యగంధి చేపకు బుట్టిరి. చరిత్రలో ప్రసిద్ధుడైన శాతవాహనుడు సింహముల బిడ్డడట. ఈ శతాబ్దమున నొకప్పుడు హైదరాబాదులో నొక మేకకు మానవశిశువు బుట్టెనట ఇవన్నియు నమ్మలేని విషయములు గనుక ఈ గోకర్ణుని జన్మ మట్టికోవలోనిది.

ఆతని పుట్టుకేగాదు వాడు మంత్రములతో సూర్యుని నిలుపుట మరియొక యాశ్చర్యము ఇంతవరకు తన పాతివ్రత్యమున సుమతీదేవి సూర్యోదయ మాపిన కథ యొకటి యున్నది ఇది రెండవది,

లోకమున నేడతీంద్రియ శక్తిపరు లక్కడక్కడ తమ సంకల్పబలమున చూపులచే వస్తువులను తమ వైపాకర్షించు కొనుట, అంతరిక్షమున నిలుపుట, ఇనుప కమ్మీలను వంచుట, గడియారముల నాపుట మున్నగు వింతలు జూపు చున్నారు చోళవంశమునకు మూల పురుషుడైన కరికాలు దర్బ్యము విడుచునపుడు జలపాత్ర లాకాశమున సంచరించుచుండెనట. కాని యట్టి ప్రభావము లాకాశమున సుదూరమున నున్న గ్రహ నక్షత్రాదులపై యెంతవరకు పనిజేయునో చెప్పలేము. ఈ యుగమందలి అధ్యాత్మిక వేత్తయైన మాస్టర్ సి.వి.వి. గారు గ్రహములు

మనపై నెటుల ప్రభావము జూపునో యోగశక్తిచే మనముగూడ వానిపై నటులే ప్రభావము జూపవచ్చు ననుచున్నారు. కనుక నీ సూర్యస్తంభన మాకోవకు జెందునేమో !

ఈ కావ్యమున నన్నిటికంటె ముఖ్యమైనది ధుంధుకారి ప్రేతత్వ విముక్తి దేహికి ప్రేతత్వ పునర్జన్మలు నేడు కొందరు నమ్మరు అయిననేమి అవి యున్నట్లీనా డచ్చటచ్చట బయటపడెడు సంఘటనలు ఋజువు జేయుచునే యున్నవి. ఇంటి నుండి వీధికి బయలుదేరిన వాడిల్లు జేరునరకు బయట నేదోయొకచోట నిలుచుచునో తిరుగుచునో యున్నట్లు పరబ్రహ్మము నుండి బయలుదేరిన జీవునకు మరల నతని జేరువరకు జన్మపరంపర దప్పదు. అపుడతనికి తొలిదేహము విడిచిన పిమ్మట కర్మకుదగిన వేరొక దేహము లభించుటకు కొంత వ్యవధి యవసరము గనుక నాకాలమున నతడు ప్రేతరూపమున నుండును. భగ్నజీవులై ఆత్మహత్యలకు పాల్పడినవారు, హత్యలు జేయబడిన వారు, ఆశలు దీరనివారు, అపరకర్మలు శ్రాద్ధాదులు నోచుకోనివారు ప్రేతరూపమునే పొందుదురని హిందువుల నమ్మకము. ప్రేతభావన నేడాస్తిక మతములన్నింట నున్నది, కొంతకాలము క్రింద "యువ" మాసపత్రికలో నురవ్ నాచికేతుడు మరో ప్రపంచమను పేర నట్టి సంఘటనలు కొన్ని వ్రాసి యుండెను.

## కర్మ ప్రభావము ప్రేతముపై నుండునా !

ఒకప్పు డుత్తర ప్రదేశ్‌లోని కాన్పూరు తాలూకాయందు "దేరాపూరు"న "మధురాప్రసాద్ దుబే" అను గేస్తుండెను అతని తండ్రిపేరు "పరమసుఖ్" అతడు మరణించినపుడు కుమారుడు సాయంకాలమున కర్మజేసెను మధురాప్రసాద్ భార్య పేరు "దులారీదేవి". ఆమెకు నలుగు రాడపిల్లలే గలిగిరి అందువలన నామె కనిపించిన ప్రతి సాధువును సుతుడు గలుగు మార్గ మడుగుచుండ నొక మహాత్ముడు శంకరుని శరణు బొందుమని చెప్పెను. అదివిని నాటినుండి యామె తమ గ్రామమున పండిత కన్హయ్యాలాల్ మిశ్రాగారు గట్టించిన శివాలయమున దినదినము పూజచేయ మొదలిడ, నొకనాటిరాత్రి కలలో మామగారు గనిపించి నేను మీకు కుమారునిగా బుట్టెదనుగాని మీరు నాకు శాస్త్ర విరుద్ధముగా కర్మజేసితిరి కాబట్టి, కాణుడనుగా బుట్టెదనని చెప్పెను. ఆ స్వప్నమునకు దులారీదేవి యాశ్చర్యపడి తెల్లవారిన పిమ్మట నిరుగుపొరుగు వారికి జెప్పెను. పిదప నామెకచిరకాలము

నకే కాణుడగు కుమారుడు గలిగెను. తలిదండ్రి యా బాలునికి "మధన్‌దుబే" అని పేరుబెట్టిరి. ఆతనికి మాటలువచ్చిన నాటినుండి పూర్వజన్మ జ్ఞానము గలిగి తాను పరమసుఖ్ దుబేగా నున్నపు డుపయోగించిన వస్తువులన్ని తలిదండ్రికి జూపు చుండెను. ఒక నా డతడు తాను పూర్వజన్మలో దాచిన నిధినిగూడ జూపెను. అతడు జెప్పిన విషయము లా దట్టునట్ల వారందరామోదించుచుండిరి. అంత కొన్ని దినములకు తలిదండ్రి యా బాలునకు చెవులు గుట్టించిరి. దానితో నతని తొలిజన్మ జ్ఞానము మందగించెను. అతడు పెరిగి పెద్దవాడైన పిమ్మట గొప్ప విద్యావంతుడై కొంతకాల ముద్యోగముజేసి మరికొంతకాలము పహిల్‌మానుగా నుండి పిమ్మట జీవితముపై విరక్తికలిగి "యోగిరాజ్ సత్యానంద సరస్వతీ మహరాజ్" గారి నాశ్రయించి సన్యాసదీక్ష తీసికొనెను. అపుడు గురువు గారతనికి "మదనానంద సరస్వతి"యని దీక్షా నామముంచెను. దీక్ష గ్రహించిన పిమ్మట నతడొకప్పుడు ముజఫర్ నగర్‌లో కాళీనదీ తీరమునగల దేవాలయమున గీతా ప్రవచనము జేయుచుండ నచటికి వచ్చిన పీల్ఖానా నివాసి భక్త శ్రీరామశరణ్ దాసుగా రతని పాండిత్యము గాంభీర్యము జూచి ప్రవచనా నంతరము చెంతకువెళ్ళి మాటాడి మీరింతటి మహానుభావులుగదా! కాణత్వ మెట్లు గలిగినదని యడిగెను. అందులకతడు తన పూర్వజన్మ గాథను వివరించి, నాకన్ను నడుమపోలేదు. అప్పటి నాకుమారుడు మరియు నిప్పటి నాతండ్రియగు మధురాప్రసాద్ దుబేగారు నేను పరమసుఖ్ దుబేగా మరణించినపుడు శాస్త్రవిరుద్ధముగా నసురసంధ్యలో కర్మజేసెను గనుక నాదోషమున జన్మచేతనే నాకన్నిటులైనదని చెప్పెను.

మధనానంద సరస్వతిగారు జెప్పిన యీయనుభవమును బట్టి జీవుడీ దేహము విడచినపుడతనికై జేయబడు కర్మ యాతని భవిష్యజ్జన్మముపై ప్రభావము జూపునని తెలియుచే గాక శ్రాద్ధములందు గేస్తులు పితృదేవతలను సత్సంతానము ప్రసాదించ వలసినదిగా వేడుదురు గాబట్టి ఆ ప్రార్థన నంగీకరించి వారదేకుటుంబమున మరల జనించు నవకాశము గూడ నుండునని బాలురకు కర్ణవేధతో పూర్వజ్ఞాన విస్మృతి గలుగుననియు తెలియును.

హిందువులకు చూడాకర్మ కర్ణవేధ షోడశ సంస్కారములందు జేరినవి. మానవుని పాపములతని కేశముల నాశ్రయించి యుండునట. అందులకే వానిని దైవ సన్నిధానమున నర్పించుట, బాలురకు పుట్టు వెంట్రుకలుదీసిన పీడలు బోవును

చెవులు గుట్టించిన మంకు మానుదురని సామాన్యులు నమ్ముదురు. మంకనగా నొకానొక పూర్వవాసనా విశేషమే గనుక హిందువులు నేడు తమబాలురకు దైవ సన్నిధానమున పుట్టువెంట్రుకలు దీయించి చెవులు గుట్టింతు రనగా నతని తొల్లి జన్మ పాపశేషమును మరియు పూర్వజ్ఞానమును దొలగించి ప్రస్తుతజన్మకు సిద్ధము జేయుట యన్నమాట. ఇట్టిది మన సంస్కారముల వెనుకగల రహస్యము.

"మరణించిన వారి నుద్దేశించిన కర్మలచే
ప్రేతత్వ విముక్తి యుండునా?"

హిందువులకు దేవతార్చన యెంత ముఖ్యమో పితృ దేవతారాధన యంత కంటెను ముఖ్యము. దేవతార్చనకైన కొంత సడలింపున్నది, పితృారాధనకులేదు. అది యతి శ్రద్ధతో చేయవలసినకర్మ. ఆకారణముననే దానికి శ్రాద్ధమని వ్యవహారము. పితృల నుద్దేశించి సత్కర్మలు జేయుట భారతీయుల కీనాటిదిగాదు. ధర్మరాజు పితృలోకమున నున్న తమతండ్రి నాకలోకము జేరుటకే రాజసూయము జేసెను. రాఘవేంద్ర స్వామిగారు సన్యాసదీక్ష గ్రహించినపుడు వారి పత్ని నూతబడి మరణించగా నామెకు తమ యుపాసనచే ప్రేతత్వము తొలగించిరట.

ఒకప్పుడుత్తర ప్రదేశ్‌లోని యొక గ్రామమునగల "శ్యాం మనోహర్ వ్యాస్" అను యువకుడు తండ్రితోగలిసి పొరుగూర జరుగు సప్తాహము జూచుటకు వెళ్ళి భజన ముగిసిన పిమ్మట తనకు సుస్తీగా నుండుటచే నారాత్రియే మరల నింటికి వచ్చుచుండెను. దారి యరణ్యముగా నుండెను గనుక నా తండ్రి కొడుకు లిద్దరచటినుండి మరియొక మనిషిని తోడుదీసకొని వచ్చుచుండిరి అది వెన్నెల రాత్రి వారిదారిలో నొక పెద్దమఱ్ఱి యుండెను. అపటికి నచ్చువర కొకపెద్ద సుడి గాలి వీచి ఆగండియను ధ్వనియొకటి వినిపించెను. అదివిని వ్యాస్‌తండ్రి గజగజ వణికి పోయెను. అతని చేతులలో పంచామృతపాత్ర యుండెను. ఆయన యా పాత్రతో నటులే చేతులజోడించి" అయ్యా! మీరెవరు? మీకేమికావలె! నని యడిగెను. అంత నాచెట్టునుండి నే నొకప్రేతమను, ఎన్నియో యేండ్లనుండి యీ దేహముతో బాధపడుచున్నాను. మీరు నాయందు దయదలచి చేతిలోని పంచా మృత పాత్ర చెట్టు మొదట నుంచుడు. దానిని సేవించుట వలన నాకీ ప్రేతవిముక్తి గలుగునను మాటలు వినిపించెను. ఆ మాటల కాశ్చర్యపడి "వ్యాస్" తండ్రి చేత నున్న పాత్ర చెట్టుమొదట నుంచెను. వారు ముగ్గురు దూరముగా నిలిచి

చూచుచుండిరి. కొంచెము సేపటికా పాత్రలోని పంచామృత మైపోయెను. పిమ్మట వారికొక మధుర మందహాసము వినిపించి చల్లని పిల్లగాలి వీచెను. ఆఘటనకు విస్మయపడి వారు కాళీపడిన పాత్రను తీసికొని యిల్లుజేరిరి. శ్యామమనోహర్‌వ్యాస్ B Sc, జదివిన యువకుడు ఈఘటన 1958 లో జరిగెను. దీనినిబట్టి మరణించిన వారికి ప్రేతరూపము గలదని యది వారినుద్దేశించి జేయు సత్కర్మలచేత భగవత్కథా శ్రవణముచేత ప్రసాదముచేత తొలగునని దెలియును.

ఇంతవరకు జెప్పిన మధనానంద సరస్వతి వృత్తాంతము మరియు విది క్రీ. శ. 1962 నాటి గుప్తపంచాంగమున ప్రకటింపబడినవి. మరణించిన వారిని గురించి చేయు శ్రాద్ధములు మరియు దానధర్మములు, ఆత్మశాంతి ప్రార్థనలు వారి భవిష్య జ్జన్మమునకు తోడుపడునని నేడు పాశ్చాత్యులుగూడ నమ్ముచున్నారు. గనుక విని ధుంధుకారికథకు నిదర్శనముగా నుండునని యిటజెప్పితిని.

# 4. నీరాజనము

ఆంధ్రమున స్వతంత్ర కావ్యములు దక్కువ. కేవల కల్పనాకథలు కృత్రిమ రత్నము లాద్యసత్కథల్ వార్ధిబుట్టు వజ్రములని రామరాజ భూషణు డెట్టిముహూర్తమున శాసించెనో గాని పింగళి సూరనవంటి యొకరిద్దరుదప్ప తక్కిన వారెవరూ రత్నములను సానబట్ట నేర్చినవారేగాని వంటనేర్చిన వారుగారు. అట్టివారిలో నితడొకడు.

కవులకు కావలసిన కథారత్నములకు స్కాంధము కాణాచి, ఆ సముద్రమున మునిగి వెదకెడువారికి తాహతుకు దగినది దొరకకపోదు. ఈ ప్రాంతమున నీకథారత్నమును మొదట వెలికిదీసి చికిలీపని జేసినవాడు ప్పునూతల నివాసి బంగారు శాస్త్రిగారు. పేరునకు దగినట్లు వారీరత్నమును సప్తాహ మాహాత్మ్యము పేర తమ కవితా సువర్ణమున పొదిగిరి. ఆయన క్రీ. శ. 1882 నందీకథను మొదట రచించెను. దానినే యిపుడు వీరీపేర మరల రచించిరి.

అప్పకవి కవుల నేడువిధములుగా వింగడించెను. వారిని మనము స్థూలముగా నలంకార ప్రధానులు విషయ ప్రధానులని రెండుగా విడగొట్టవచ్చును. మొదటివారు కథను వివిధమైన శబ్దాలంకారములతో సందర్భానుగుణమైన వర్ణనలతో జెప్పుచుపోగా రెండవవారు రసపోషణ కవసరమైన మేరకే వానిని గ్రహించుచు కథ నడిపింతురు. ఆంధ్ర సాహిత్యమున యెఱ్ఱనసోమన లట్టివారు సాహిత్య పాథోనిధి మథనసందర్భమున వాథోరాకే బంతిని నిలిచిన సూర్యచంద్రులు. పేరునకు దగినట్లెఱ్ఱన రసమార్గమును సోమన యలంకార మార్గమును వరించి తమ హరివంశములచే నా యా మార్గములకు గురువులైరి. అటులే యీ కావ్యవిషయమున బంగారుశాస్త్రిగారిది పేరునకు దగినట్లలంకార మార్గము కాగా నితనిది రసమార్గమనియే జెప్పవలసి యుండును తిక్కనగారు నిర్వచనోత్తర రామాయణమున కవితా నియమమును జెప్పుచు

> "పలుకుల పొందులేక, రసభంగము జేయుచు ప్రాతవడ్డ మా
> టల దమనేర్పుజూపి యొకటం హృదయం బలరింపలేక, యే

పొలమును గాని యట్టి క్రమమును దమ మెచ్చుగ లోకమెల్ల న
వ్వలి బొరయం జరించుచు గుకవుల్ ధర దుర్విటులట్ల జూడగన్"

అవి పలుకు పొందులేక రసభంగము జేయుచు ప్రాతవడ్డ మాటలతో కవితల్లువారిని నవ్వులపాలు జేసెను. ఇందలి ప్రాతవడ్డ మాటలను బట్టుకొని యెవరైన సాహిత్యమున నెవరు వాడినను అవే పదములుగాని క్రొత్త వెక్కడి నుండి వచ్చు ననవచ్చును. అటులే కావ్యవస్తు సామగ్రిని గురించి గూడ యడుగ వచ్చును. దానికి

వాచస్పతి సహస్రాణాం యత్నైరపి సహస్రశః
నిబద్ధాపి క్షయంనైతి ప్రకృతి ర్జగతామివ

పెక్కు వేలమంది బృహస్పతులు పెక్కు విధముల యత్నించినను సత్త్వ రజస్తమో రూపమైన జగత్ప్రకృతివలె కావ్యసామగ్రి నశింపదని లాక్షణికులు జెప్పిరి.

దృష్టపూర్వా అపిహ్యర్థాః కావ్యే రసపరిగ్రహాత్
సర్వే నవాఇవాఒభాంతి మధుమాస ఇవ ద్రుమాః

కావ్యార్థము లంతవరకు జూడబడిన పైనను రసపరిగ్రహముచే వసంత కాలమందలి వృక్షములవలె నూతనముగనే భాసిల్లునని చెప్పబడినది. గనుక నట్టి నూతనత్వ మితని రచనలో గనిపించును. ఆ ప్రతిభ యితని జానకీ పరిణయము నుండియే దర్శనమిచ్చును. మచ్చునకందలి యీపద్యమును దిలకింపుడు.

సీ. చంద్రశేఖర శిరస్సాంద్ర జటాజూట
నిస్సృతాపగ మొదల్ నిలిచె నెందు
శర్వుని వరియింప సర్వమంగళ యెందు
నపగతాహారయై తపమొనర్చె
నిఖిల రుజాక్లేశ నిర్మూల నార్హమౌ
దివ్యౌషధులు నెందు దేజరిల్లు
అనలార్క తాపంబు నతిశయింపగ నీని
చల్లదనం బెందు నల్లసిల్లు

అట్టి శృంగార విస్ఫుర ద్భమర గాంగ
భంగ సంఘాహతో త్తుంగ సైకతాను
మండితంబగు హిమగిరి మకుటమౌను
ధీర జనగీత భారత దేశమాత :

కథ రసవు పెల్లున జానకీ పరిణయమున మరకలు వారినంతగా నిందు పార లేదు. మైదానదశను బొందిన నదివలె శాంతముగా సాగినది.

ఈ ప్రాంతమున నిదే కథను[7] గంగవరము నరసింహాచార్యులు నాటక ముగా రచించిరి. ఈ మువ్వురు మూలమున నెవరికి దగినమార్పులు వారు జేసి కొనిరి. వీరేగాక జమ్మలూర్లు నివాసి శ్రీ కాశీరామశర్మగారు తమ పురుషోత్తమానంద విజయమున నిందలి భక్తిదేవి కథను యథాశక్తి ననువదించిరి. గనుక నీ ప్రాంత మున నీకథ క్రీ. శ. 1882 నుండి 1931 వరకేదో యొక రూపమున పునరావృత్త మగుచునే యుండినదని దెలియును.

బంగారుశాస్త్రిగారు తమ కృత్యవతారికయందు కావ్యరచనా కారణము జెప్పి ఆనాటి రాఘవరావుగారి కొండారెడ్డిపల్లె సస్తాహమును, అచటికి వచ్చిన బ్రాహ్మణు లను, తమ గురువగు నచ్యుతస్వామిపై సరసకవితా ఫణితిని వర్ణించెను గాని యీయన కృతి యందట్టి యవతారిక యేదియులేదు. దేవతాస్తుతి పిమ్మట నేరుగా కథారంభము జరిగినది. కవులు సాధారణముగా మొదట కావ్యకథా రచన జేసిన పిమ్మట వీలునుబట్టి యవతారికలు ఆశ్వాసాంతములు కుదిరించు కొనుచుందురు. కనుక వీరును మొదట కథారచన మాత్రము జేసెను. అప్పటి కితనికి తన కావ్య మును వినువాడుగాని యడుగువాడుగాని కటస్థపడెనో లేదో గాబట్టి యవతారిక మాటెత్తలేదని పించును.

నాకు లభించిన దీవిప్రతిలో ప్రథమాశ్వాసము దప్ప తక్కిన యాశ్వాసాంత ములు మిక్కిలి చిత్తుగా నసంపూర్ణముగా, కొట్టివేతలతో నిండి, భావివారి నిర్ణ యమునకే వేచియుండెను. నేను వానియందుచితమని పించిన భాగములతో నాశ్వా సాంతములు పూరించితిని. కవిగారే యొకవేళ వానిని సరిజేసి యవతారిక గూడ రచించి యున్నయెడల యీ కావ్య మే పరిస్థితులలో యవతరించెనో మనకు స్పష్ట ముగా దెలిపెడిదిగాని యటుల జరుగలేదు.

వేంకటాచార్యుల శైలి సంస్కృత పదప్రచురమై ప్రౌఢముగా మరియు సలక్షణముగా నున్నది. కవితా ధారయందెచటను జటిలత లేదు. చివరివరకేకరీతిగా సాగినది. పద్యముపట్టి పట్టి గూర్చినట్లుగాక దాని సహజధోరణిలో నడినడచినది. ప్రబంధ కవులు పద్యమెంత తెనుగుదనమున వ్రాసినను వచనమునకు వచ్చువరకిది తెనుగేనా యనిపింతురు కాని వేంకటాచార్యు లట్లుగాదు పద్య గద్యముల నేకరీతిగా నడిపెను.

"కాదన కింతపాటి యుపకారము" 1-140, "భువిగూలి రెవ్వాని భూభ్రంగమున తొల్లి 1-133, గౌతమ భృగు కణ్వ కశ్యప జమదగ్ని 2-14 మున్నగు పద్యములందితని యందు కవిత్రయపు పోకడలు గనిపించినను కథ భాగవత సంబంధి గావున నితనిపై పోతనగారి ప్రభావముండుట సహజము. ఆయనకువలెనే యితనికి గూడ శ్రీరాముడే యిష్టదైవము. "వైదేహీ సహితం సురద్రుమతలే" అను మూర్తి యొక్క రూపమును గ్రహించి" అతిలోక వస్తు సమంచిత పుష్పక, శుభ విమానాంచిత శోభమాన" అని యొక పెద్ద పీటపై గూర్చుండబెట్టెను అంతేగాక.

"కౌసల్యోదర శుక్తి మౌక్తిక !" మహీకన్యా మహోరస్థలీ వ్యాసక్తాంచిత తారహార "అని ఆ దేవుని గురించి చేసిన భావన మనోహరము. అతనివి నానా సిద్ధాంత పదీచతుష్పథ" అని విశేషించుటలో ఆయనకుగల రామ తత్త్వావగాహన యెట్టిదో దెలియును.

"అనుపేతుండయి వీతకర్ముడయి" అనుశుక ప్రార్థనము. "సముద్దైయెవ్వడు ముక్తకర్మచయుడై" అను పోతనగారి శుకప్రార్థనకు దేహాంతరము. అటులే కలిపురుషుని వర్ణించిన "అతిలోకస్థిర సత్యవిక్రమ 1-74, పొలియింపన్ సమకట్టి పై దొడరి పోబోవంగ 1-76 అను పద్యములు పోతనగారి మూసలోనివే. ఆయన అంత్యప్రాసలు శ్లేషలు మాత్రమితనిలో గనిపించవు గాని శబ్దముల పోహళింపు అచ్చు మతనిదిగనే యుండును. చాలవు సుంతముక్తిని నొసంగగ 1-115 అను భక్తిభావము పోతనగారిదే. ఇటులెన్నియైన యితనిలో పోతనగారి రీతులు జూపవచ్చును. ప్రథమాశ్వాసమున కవి యిందుజేసిన కలిధర్మ వర్ణనము నేటి సమాజమునకు ప్రతిబింబము చూడుడు.

కూట భాషణగాని, బొంకునను గాని
వివిధ దుష్కృత్యములను గావించి గాని
కపట వేషాలు దాల్చియుగాని యెటులొ
కడుపు నిండించు కొనువారె ఘనులు నేడు. 1

కం. అమిత ప్రేమాస్పదులై
తమినుండగ దగినయట్టి దంపతు లిలలో
దమలోన దామె యొండొరు
గమకింతురు మోసగింప కౌటిల్యమునన్. 2

చ. అరసిన గానరారు కరుణాఢ్యులు చేపడ రెండు సత్యవా
క్పరతులు లేరుయోగులు వినీతి పరాయణులైనవారు, చి
క్కరు నియమానుపాలకులు గల్గరుదారనిసర్గ సద్గుణా
కరులగు వారలొక్కరునుగాని లభింపరు భూతలంబునన్. 3

ఇది యచ్చముగా మనకాలమును కేమెరాతో లాగినట్లే యున్నదిగదా। అటులే నారదుడు జ్ఞాన వైరాగ్యముల పుష్టినిగూర్చి యడుగుటకై మునుల చెంతకు వెళ్ళినపుడు వారతని రాక విని, చూచి, పొందిన తడబాటులో స్వభావ రీతిగా మన్నది. ఒక మీర రానివాడు వచ్చి గడ్డు సమస్య నొకటి మనల నడుగునపుడెటుల తప్పుకొన జూతుమో అది యందు గనిపించును.

తిక్కనగారు సీసములను వస్తు విస్తరమునకై వాడగా శ్రీనాథుడవి వస్తు పుష్టికై యెక్కువగా వాడెను. తెనుగునాట శ్రీనాథుని సీస ప్రభావమునకు లోను గాని కవికుమారుడు లేడు గాని వానినతనివలె సమర్థముగా నిర్వహించి పేరువని పించుకున్న వారు తక్కువ.

కవికి సీసము సులభము వృత్తమునకు వలె యతిప్రాసలు లేకపోవుట దాని కొక కారణముగా వచ్చును. గాని వాని నెత్తుకొనిన పిమ్మట గంభీరముగా, నిండు దనముగా నేకరీతిగా నడుపుట నందరకు చేతగాదు. తగినంత పుష్టిగా నడుపలేని సీసము టక్కుటేనుగును గట్టివేసి నట్లుండును.

ఇతవి సీసము లెత్తుగడయందును తీర్పునందును శ్రీనాథుని దలపించును. అఖిలాగమాంత సిద్ధాంత విష్పన్నుండు 1-12, శిష్యప్రశిష్య సంసేవిత 2-6, పావన క్షేత్ర సంసేవనంబున కంటె 2-45, భక్తవత్సలుడు శ్రీవత్సాంకుడు 2-74 హింసకులాచార హీనుడు 2-81, స్నాన సంధ్యాది 2-132, మున్నగు సీసము లందులకుదాహరణములు. అవి పాదాంత సమకములతో తీర్చి పెట్టినట్లుండును. తినబోవువారికిక రుచులు జెప్పుట యెందులకు? పుస్తకమును విప్పిన మీరే యీ కవిగారి విశేషములెరుగ గలరు గదా!

వాణీ సదనం, నాగర్‌కర్నూలు,
దుర్మతి కార్తీక శుద్ధ నవమి
శుక్రవారం 6-11-81

కపిలవాయి లింగమూర్తి

# అంక సూచికలు

## 1. ప్రపన్నామృతకర్త :

ఇతని పేరనంతాచార్యులని భగవద్రామానుజుల శిష్యుడైన వడుగనంబి వంశీయుడని, చదలవాడ మల్లన సమకాలికుడని క్రీ.శ. 16వ శతాబ్ది వాడని శ్రీ నిడుదవోలు సుందరేశ్వరరావుగారు తెలిపిరి.

## 2. బంగారు భావనాచార్యులు :

ఈయన పూర్తి పేరు కోవిల్ కందాడై అణ్ణన్ కృష్ణమాచార్యులు. బంగారు భావనాచార్యులన్నది బిరుదు. వీరు శ్రీవైష్ణవ బ్రాహ్మణులు. వాధూలస గోత్రులు. వీరి జన్మ ప్రాంతము కంచియట. తెలంగాణమున వీరిది పేరందినపీఠము. ఈ వంశీయులు సురభి దొరల గురువులు.

కృష్ణమాచార్యుల తల్లిదండ్రులు అలమేలుమంగా సింగరాచార్యులు. పురుష వెంకటాచార్యులు వీరి గురువు. బూర్గుల రామకృష్ణారావు, మందుముల నరసింగ రావు, మన్నెముకొండ హనుమద్దాసు వీరి శిష్యకోటిలో కొందరు.

## 3. విక్రాల వెంకటాచార్యులు :

వీరాంధ్ర వైష్ణవ బ్రాహ్మణులు. రాజనగర నివాసులు. భారద్వాజస గోత్రులు. ఆపస్తంబ సూత్రులు. వేంకటాచార్యుల తండ్రిగారు శేషాచార్యులు. వీరికాలమున వనపర్తి యందాచార్ల వారి స్థానము గొప్పది. శేషాచార్యులు తన కుమారుడు ఆచార్ల రంగాచార్లను మించవలెనని విద్యాభ్యాసమునకు కాశికి బంపెను గాని అతనికచటికి వెళ్ళగానే తగిన గురువు దొరకలేదట. కొంత కాలముండి నిరాశతో తిరిగి వచ్చుచు ప్రయాగలో నొకనాడు గంగాతీరమున విచారమున గూర్చుండగా నొకచట నొక యతీంద్రుడు కనిపించి విచారణ కారణమడిగి దక్షిణామూర్తి మంత్రోపదేశము జేసి నీకిక తగిన గురువు దొరుకును పొమ్మని యుత్సాహపరచి మరల వెనుకకు బంపిరట. అంత వెంకటాచార్యులా మంత్ర

ముమ జపించుచు కాశికి మరల వెళ్ళగా నతనికి నచ్చిన గురువు దొరికి ఆరేండ్లలో నేర్చుకొనవలసిన విద్య మూడేండ్లలో నేర్చెనట. అపుడతడు నిండుయవ్వనమున నుండెనట. అందువలన తీవ్రమైన విద్యా పరిశ్రమతో మతిభ్రమించి కాశీ వీధులలో తిరుగుచుండ తెలిసిన వారెవరో యతని దశ జూచి వచ్చి యింటి దగ్గర తండ్రికి చెప్పిరట. అపుడాయన బంధువులను బంపి కుమారునేలాగో యింటికి రప్పించిన తరువాత కుటస్థు డతనిని లోకమునకు గొనికప్పుటకొరకు వేశ్యామణి కప్పగించిరట. అపుడామె యతని నీలోకమునకు దెచ్చెనట. గాని యతనికి జీవితాంత మదియొక వ్యసనముగా మిగిలెనట.

## 4. చింతామణి యామునాచార్యులు :

ఈయన శంకరంపేట నివాసి. శ్రీవైష్ణవ బ్రాహ్మణుడు, సాంఖ్యాయనస గోత్రుడు, ఆపస్తంబ సూత్రుడు. వేంకట లక్ష్మాంబా శేషాచార్యులీతని తలిదండ్రులు. ఈయన క్రీ.శ. 1890 లో జనించి 1970 లో పరమపదించెను. ఇతడు గద్వాలాస్థాన పండితుడు; బహుగ్రంథ కర్త.

## 5. బోయినిపల్లె కృష్ణమాచార్యులు :

ఈయన వేంకటాచార్యుల జ్ఞాతి. ఇతనిశాఖ బోయవిపల్లెలో నివసించి యుండెను. భోజనపల్లె-బోయవిపల్లె పూర్వము ప్రక్క ప్రక్క పల్లెలు. కృష్ణమాచార్యులు, వేంకటాచార్యులొకే శాఖకు జెందినవారు. కాని కాలాంతరమున కృష్ణమాచార్యులకు దంతునూరివారని వేంకటాచార్యుల కాత్మకూరివారని వేరువేరు గృహనామము లేర్పడినవి. కృష్ణమాచార్యులను చిన్నతనముననే కవితాకాంత వరించినది. వీరితో పాటీయన భార్య గూడ కవయిత్రి. ఆమె పేరండాళమ్మగారు. ఆమె చింతామణి యామునా చార్యుల సోదరి. ఆమె ఆలీఘర్ విశ్వవిద్యాలయము నుండి హిందీయందు "భాషాభూషణ" పట్టమంది గద్వాల బాలికోన్నత పాఠశాలయందు ప్రధానోపాధ్యాయురాలిగా పనిజేసెను. హనుమజ్జీవితము, ఉమామహేశ్వర వ్రత కథ ఈమె కృతులు. హనుమజ్జీవితము హిందీనుండి యనువదింప బడినది. ఉమామహేశ్వర వ్రతకథ స్కాంధ మందలి దానికి పద్యానువాదము. దానిప్రతి పీమె యనంతరము శ్రీ మంగునూరి రామేశ్వరరావుగారు సంపాదించి పంపగా కుసుమహరనాథ పత్రికవారు 1957 నవంబరునుండి వరుసగా నాలుగు సంచికలలో ప్రచురించిరి. అవి మొత్తము 95 పద్యము లుండును.

### 6. బంగారు శాస్త్రిగారు :

ఈయన స్మార్తుడు వీరి యింటి పేరల్లాడవారు. వీరు శ్రీవత్సగోత్రులు, అంబమాంబ లక్ష్మణశాస్త్రిగారు వారి జననీజనకులు. తలిదండ్రు లాయనకు పెట్టిన పేరు వెంకటనరసింహయ్య. ఆయన ఉప్పునూతల సమీపమందలి రంగంపేటలో గల గుడిమంచి అంబయ్యశాస్త్రి గారింటికి దత్తు వెళ్ళెను. ఆయన భార్య పేరు రాఘవమ్మ. వీరికిగూడ సంతానము గలుగలేదు, శాస్త్రిగారు సంస్కృతాంధ్రము లందు మార్గదేశీ రచనలందు చేయి తిరిగినవారు. అచ్యుతస్వామివారి శిష్యులు మరియు అచ్చంపేట నరసింగయ్యగారికి కవితా గురువులు. అన్నింటికి మించి రసజ్ఞశేఖరులు. వారి పాండితీపటిమకు మెచ్చి కొండారెడ్డిపల్లె రాఘవగారు తమ ఆస్థాన కవిగా నియమించుకొనిరి. ఈయన బహుగ్రంధకర్త. వానిలో యక్షగానము లెక్కువ. అవి ప్రౌఢముగా నుండును. శాస్త్రిగారు 18 వ శతాబ్దమున నుండిరి.

### 7. గంగవరము నరసింహాచార్యులు :

ఈయన శ్రీవైష్ణవ బ్రాహ్మణుడు. గంగవర నివాసి, వీరి యింటిపేరు చింతామణివారు. శేషాంబ వెంకటనరసింహాచార్యు లీతని తలిదండ్రులు. వీరస్థాన ధానమున ఘటికులు. మార్గదేశీ కవితలందు చేయి తిరిగినవారు, బహుగ్రంధ కర్తలు వీరి కృతులలో నాటకము లెక్కువ. వాని అంకితములలో ఈ ప్రాంత మందలి పెక్కు కుటుంబముల ప్రశస్తి దెలియును. ఈయన 19 వ శతాబ్దివాడు.

### 8. వర్ధమానపురము :

ఈ పేరున నాగర్కర్నూలు తాలూకాలోనేగాక ప్రస్తుత మాత్మకూరు తాలూకాయందు మరియు కర్నూలు జిల్లాయందు ఒక్కొక్క గ్రామములున్నవి. క్రీ. శ. 12 వ శతాబ్దమునాటి ఆలపాడు తామ్రశాసనము వర్ధమానపురము వరాహ విషయమందలి పట్టణమని జెప్పినదిగాని నాడా పేరెంత భాగమునకు వర్తించు చుండెనో తెలియదు, చాణుక్య ధర్మశాస్త్రమున పేర్కొనిన ఆశ్మంతక దేశము పూర్వ మీ ప్రాంతమేనని శ్రీ తెలకపల్లె విశ్వనాధశర్మగారి మతము.

ఈ గ్రామమునకు క్రీ శ. 9 వ శతాబ్దినాటి పులిజాల, అగస్త్యేశ్వర శాస నములందు వడ్డవాని యనియే వ్యవహారము. వానియందది ఏన్నూటిగా జెప్పబడినది. కాకతీయ శాసనమే మొదటిసారిగా దీనిని సంస్కృతీకరించినట్లు ద్రోచును. నేడిది

జైనతీర్థంకరుడైన వర్ధమాన మహావీరుని పేరిదిగా దలచుచున్నారుగాని దీని సమీప మందలి ధర్మవరమున నవలోకితేశ్వరుని ప్రతిమ యొకటి బయట పడినది దానిని పిల్లలమఱ్ఱికి గొనిపోయిరి.

హనుమకొండ శాసనకర్త ఈ గ్రామమును లంకా పట్టణముతో పోల్చెను. చింతలపల్లి వీరరాఘవకవి మధురవాణీ విలాసమున నామెయొక్క తండ్రి పట్టణముగా పరోక్షముగా దీని వైభవమును వర్ణించెను. ఇది రాజధానిగానున్న దినములందు దీనికి ధర్మవరము న్యాయస్థానముగా, బిజ్జనపల్లె విజ్ఞాన కేంద్రముగా, పాళెము సైన్యావాసముగా, కావాపుర ముపవనముగా మాయెలవార క్రీడా క్షేత్రముగా నుండెనట.

## 9. బిజ్జనపల్లె :

దీనికి భోజనపల్లె యని పూర్వ వ్యవహారము. ఈ గ్రామము పూర్వము చోళులచేత బ్రాహ్మణులకు భుక్తికై యిచ్చిన స్థలమున వెలయుటచే నాపేరున బిలిచిరట. పిమ్మట నరి యీ ప్రాంతమును పాలించిన చాళుక్య సామంతుడగు బిజ్జన పేర బిజ్జనపల్లెగా మారి నేడు బిజ్జనపల్లె యయ్యెను. చోళుల పిమ్మట నీ ప్రాంతమును గోనప్రభువులేలిరి వారు త్రిశూల లాంఛనులు. చెఱకురెడ్లు ఢమరుక లాంఛనులు.

ఈ ప్రాంతమున గోనవారిచే నీయబడిన భూములు వానియందు వెలసిన గ్రామములు నేడు పెక్కులున్నవి. గోనవారు శైవులు. నేడు బిజ్జనపల్లె సమీపమందలి జంగమయ్యపల్లె బలిజెపల్లె ఆనాడు వారు జంగాలకు బలిజలకు యిచ్చిన భూములు. అటులే ముమ్మయపల్లె శాయనపల్లె వారశ్వ దళాధిపతుల కిచ్చిన పేరిలు ఇపుడు బిజనపల్లె ప్రక్కనున్న బోయాపుర మొకప్పటి బోయనపల్లె గోనప్రభువుల యాస్థానమున వాడుబోయలు సరదార్లుగా జెట్టీలుగా నుండిరి. కొండ బోయనివారు, పుల్లబోయనివారు, భైరవ బోయనివారు, మల్లాజెట్టివారు, ఇమ్మడి జెట్టివారు మున్నగు యింటిపేర్లుగల పెక్కు మున్నూరు కుటుంబము లీ ప్రాంతమున నేడు గనిపించును. ఆ పేర్లలో కనిపించు కొండబోయుడు, పుల్లబోయుడు, భైరవ బోయడు, మల్లాజెట్టి, ఇమ్మడిజెట్టి మొదలైన వారానాడు గోనప్రభువులను గొలిచిన యోధులు.

10. ఈ ప్రాంతమున ఇంకను సత్యనారాయణ స్వామి కథను రచించిన వారు :

1) వడ్డెము పాపకవి : సత్యనారాయణ స్వామి హరికథ (అముద్రితము)

2) విక్రాల నరసింహాచార్యులు : శ్రీ మదాంధ్ర సత్యనారాయణ వ్రతము (ముద్రితము)

3) జాజాల వాసుదేవశర్మ : ఆంధ్ర సత్యనారాయణ వ్రత కథలు - వచనము (అముద్రితము)

4) కౌకఅణ్ణన్ సంపత్కుమారాచార్యులు : సత్యనారాయణ స్తవ రాజము (అముద్రితము)

5) దీక్షితుల నరసింహశాస్త్రి : తెలుగు సత్యనారాయణ వ్రత కల్పము - పద్యము (అముద్రితము)

6) చేపూరు పెద్ద లక్ష్మయ్యగారు : సత్యనారాయణ వ్రతకథా గీతము (అముద్రితము)

7) కపిలవాయి లింగమూర్తి : కథా పంచకము వచనము (అముద్రితము)

స ం పూ ర్ణ ము

# శ్రీమద్భాగవత మాహాత్మ్యము

## ప్రథమాశ్వాసము

కం. శ్రీకర సరయూ జలరుహ
వాక సవేధిత షరోపవన రేఖాంచ
త్సాకేత రాజధానీ
ప్రాకట సామ్రాజ్య లోల! రామనృపాలా! 1

సీ. అతిలోకవస్తు సమంచిత పుష్పక
శుభ విమానాంచిత శోభమాన
కల్పకానోకహ, కలిత తలంబున
దత హైమ సౌధ మధ్యంబునందు
మహనీయ మణిమయ మంజులభా భాస
మాన పీఠాసనాసీనుఁడగుచు
వామాంకమున శ్రిత పాత్రావనార్థమై
వెలసిన సీత దన్నెలమి గొలువ

హనుమ స్వకృత రామాయణంబు జదువ
మునులు పరతత్వ సిద్ధాంతములు రచింప
ముప్వురు తమ్ములు సేవింప మురువు గాంచు
నంబుదశ్యామ శ్రీరాము నలరికొలతు 2

శా. కౌసల్యా దరశుక్తి మౌక్తిక మహీకన్యా మహోరస్థలీ
వ్యాసక్తాంచితహార, పంక్తిరథ భూపాలాధ్వరా రామదే
శా సంవాసిత నవ్య కల్పక, జగత్కల్యాణ సర్వస్వ నా
నా సిద్ధాంత పదీ చతుష్పథ శరణ్యా రామచంద్ర ప్రభూ. 3

మ. అనుపేతుండయి వీతకర్ముఁడయిన వ్యస్తుండునై యొప్పియే
యనఘుండేగిన భీతి వ్యాసుడు కుమారా! యంచు వెన్నాడి, పి
ల్చిన యంతన్. దరువుల్ ప్రతిస్వనములిచ్చెన్ దన్మయత్వాననా
యనవద్యున్ శుకు సర్వభూత హృదయున్ ధ్యానింతు నశ్రాంతమున్. 4

ఉ. పుణ్య సరిత్పవిత్రితము, పుష్ప ఫలాంచిత నైకపాదప
శ్రేణ్య సశోభితంబు, మునిశేఖర సేవితమైన నైమిశా
రణ్యమునం దపోధన పురందరుడై సుఖమున్న మౌని రా
డ్గణ్యుని సూతు శౌనకుడు కౌతుకియై ప్రణమిల్లి యిట్లనున్. 5

చ. ఇనకరముల్ తమి ప్రమవియించిన చాడ్పున తావక ప్రబో
ధనమున మోహజాలము యథాయథలై చనుగావునన్ దపో
ధన! యొక పావనార్థ సముదార కథన్ దగనానతీయవే
యన వధి కోపమంబయిన యట్టిది కర్ణ రసాయనంబుగన్. 6

సీ. పరమ భక్తి జ్ఞాన వైరాగ్యముల కాప్త
మగు వివేకం బెట్లు నెగడ గలదు
వైష్ణవ ప్రవరు లేపగిది గావింతురు
ప్రబల మాయా మోహ భంజనంబు
పావనంబులకెల్ల పావనంబెయ్యది
శ్రేయస్సులకు నెల్ల శ్రేయమెద్ది
దారుణంబగు కలిదాపురించిన యేని
జీవులాసుర వృత్తి జెందగలరు

కలివిశాల కరాళాస్య గహ్వరమున
దవిలి క్లేశ విక్లాంతుడై తపుడగుచు
నలమటం జిక్కి చిక్కిన యట్టి బడుగు
వెడగు సంస్కృతికేమి గావింపవలయు, 7

తే. నలిన సంభవ, సనకసనందనాది
ముఖ్య యోగి దుర్లభమై యమోఘమైన
వాసు దెవుని ప్రాప్తి కుపాయమెద్ది
యట్టి పరమార్థమును దగనాన తీవె, 8

చ. నరపతి మెచ్చెనేనియు ధన ప్రచురంబగు రాజ్యమిచ్చు నా
సురమణి మెచ్చి యిచ్చునెడ, శోభిత దివ్య పదార్థ మిచ్చు, ని
ర్జరవిభుడిచ్చునేని యమరావతి వాస సుఖంబె కాని స
ద్గురు వరుడాత్మ మెచ్చిన వికుంఠ పురాశ్రయ సౌఖ్య మిచ్చెడున్. 9

వ. అనిన విని యట్లు పరతత్త్వ విచార వాంఛ యొదవుట కడులెస్స. ఇది నాకును సమ్మతంబయినయది గావున నా యోపినంత వట్టు విచారించి నీ సంశయ విచ్ఛేదంబై ప్రియంబొదవునట్లు వలికెద నవహితుండవై యా కర్ణింపుమని యిట్లనియె. 10

సీ. అఖిలాగమాంత సిద్ధాంత నిష్పన్నంబు
దృఢ భక్తి సంపదుద్దీపకంబు
క్రూర సంసారోరు రోగాపహరణంబు
బహుళ సంశయ వినివారణంబు
హర విధాత్రాది సురాభ్యనుష్ఠేయంబు
మధురశశ్వద్రస సమంజులంబు
జగద తీతానంద సౌధ సోపానంబు
వసు దేవసుత మనోవశ్యకరము

భయదకాల ఫణాధర వదన కబళ
భీతి విర్ణాశ కరణైక హేతువగుచు
కేవలంబయి శుకపరిగీతమయిన
భాగవతమను శాస్త్రమే పరమహితము. 11

తే. జగతి చిత్త సంశుద్ధిని నలుపగలది
దీని కంటెను మరి యొండు గానరాదు
పూర్వ జన్మాంతరార్జిత పూర్ణ పుణ్య
ఫలమటన్నను శ్రీభాగవతము సుమ్ము. 12

చ. రవివిభ తేజు లౌ మునివి పురందరకోటుల పుణ్య గోష్ఠి మ
క్కువ వెలయం బరీక్షితునకున్ భవపావనమై తనర్చు భా
గవత పురాణమున్ మదువగా శుకుడుద్యతుడైన దేవ పుం
గవుల మృతంపు కుంభమును గైకొని వేయట కేగినమ్రులై. 13

చ. వినుత తపః ప్రవీణ ! అరవింద భవప్రతిమాన! వ్యాసనం
దన ! యమృతంబు గైకొని కథా మృత మీయఁగదయ్య మాకు నీ
వినిమయ మొప్పునేని పృథివీ పతికీ సుధ నీ గదయ్య మే
మొనరగ తత్కథామృతము నుబ్బుచు గ్రోలెదమయ్య నీ కృపన్. 14

వ. ఇక్కార్యంబున రాజునకు ముని కుమార శాపప్రేరిత తక్ష కాశీ విష
భయంబు లేక సుఖం బొందవు. మాకును వాంఛా సిద్ధియగుంగావున
నుభయ తారకంబగు నీ వినిమయంబునకు నీ వనుమతించెదవే?
యను వేల్పు పల్కులకు కించిన్మందస్మితరుచిర పుల్లగండ
భాగుండై శుకుండు. 15

తే అమృత మేడ శ్రీ భాగవతామృతమ్మ
నంగనేడ? జగతి గాజునకును మణికి
సమత యొదవున దేవతా జనములార !
తగని యడియాసలను జెంది వగవ వలదు. 16

వ. అని అమరుల విరక్తరుల, విరాశులం గావించి తనదివ్య చిత్తంబున. 17

సీ. భక్తులు గారని భావించి శుక మౌని
కథ సుధాంధసులకీ గలుగదయ్యె
పావనశ్రీ భాగవత చరిత్రంబన్న
బృందారకులకైన జెంద నరిది
యాత్తరేయుడు ముక్తి నధిగమించిన విని
యబ్జాసనుడు విస్మయసంబునంది
బ్రహ్మ లోకంబున బ్రానున తత్కథ
సాధనాంతరముల సంఘటింప

నధిక గౌరవ మూనె కథామృతంబె
సకల తాపసగణము లాశ్చర్య మొందె
భాగవత శాస్త్రమును భగవత్స్వరూప
మనుచు దలచిరి జగతి నధ్యాత్మ విదులు 18

వ. భాగవత శ్రవణ పఠనాదులు సద్యోమోక్షకరంబులు, పరమ కరుణాకరులగు సనకాదులు నారదునకీ యంశం బొక తఱి నెఱింగించి రదియుంగాక బ్రహ్మ సంబంధం బతని కొదవ్పటంజేసి యెట్లైన దెలియననుట విర్వివాదాంశంబు గావున సప్తాహ భాగవత శ్రవణంబున శాశ్వత బ్రహ్మపదంబు సిద్ధించునని సూతుండెఱింగింపుటయు, శౌనకుండు. 19

తే విమిషమేనొక యెడగాలునిలువనీక
విగిడి జగడాల దనపొట్ట నింపుకొనెడు
విబుధమౌనికి సప్తాహ విధియు శ్రవణ
సనక ముఖ సమాగమమెట్లు సంఘటిలెనొ? 20

వ. అనిన సూతుండు, నారదుండు ఒక్క సమయంబున బరమ భక్తుండైన శిష్యునితోడ విచారించి, చర్చించి విష్పన్నంబు గావించికొని యున్న యంశంబు నాకెఱింగించె, నాయితిహాసంబు నుడివిన నీ సంశయ నివారణంబును భక్తి సందీపనంబును నగునని తెలిపి సావధానుండవై వినుమని శౌనకున కిట్లని తెలుపం దొడంగె. 21

తే. నఖవు రతిలోక తేజులత్యమలమతులు
సత్సమాగమమునకేగు సమయమందు
శ్రీవిశాలా పురింజేరి సేతవలన
నొకట నారదు గన్గొని యొక్కనాడు. 22

వ. పరమాదరంబున నతండున్నెడ కరిగి సానుకంపంబుగా నతనితో నిట్లనిరి. 23

సీ. వెల్వెల బారు నీ విన్నదనం బేల
మాన్య నీవదనేందు మండలమున
వ్యసనంబు వత్త్రోడి వసమరి పోనేల
ప్రాజ్ఞనీ యచల ధీరత్వ గరిమ
ధనము గోల్పడినట్టి మనుజు వోలె యిటేల
మహనీయ యీమతి, మాలి యునికి

సర్వసంగ విముక్తి సలిపిన నీకేల
  పరువు సెల్లని నీయవస్థ గలుగ
వింత తొందర జనుచుంటి వెటకొ గాని
యెట్టి గురుకార్యమైనగాకేగ గలవె
యాటకు వెందుండి వచ్చితి ఋషిలలామ!
దీనికగు కారణమదేమొ తెలుపు మయ్య. 24

వ. అనవుడు నారదుండు తన వృత్తాంతంబు మహనీయుల కిట్లు
వక్కాణించె. 25

మ. ధర సర్వోత్తమ మండలంపున బ్రమోదం బార నేతెంచి పు
ష్కరముంగాంచి ప్రయాగకేగితి గయాకాశీ కురుక్షేత్రముల్
పరిశీలించుచు గౌతమింగని హరిద్వారంబు శ్రీరంగమున్
గరిశైలేశ్వరు సేతుబంధనము వేడ్కన్ జేరి సేవించితిన్. 26

మ. అవనిన్ నే జని పూజ సల్పనివి పుణ్యక్షేత్రముల్ లేవు, నే
నవగాహింపని దివ్య తీర్థములు లేవందెన్నొ సార్లేగినే
నవి పాటించితినైనగాని యెట శాంత్యానంద సౌఖ్యప్రదం
బవు క్షేత్రోత్తమ మొక్కటైన గననయ్యా! ధాత్రి నేవింతకున్. 27

తే. కరమధర్మ సమిత్రుడై కడఁగునట్టి
ఘోరకలి చెయ్దములచేత గుంది తనదు
చేవ, నానాట గొఱవడి చిక్కి వసుధ
పార హీనతగాంచె నీ సమయమందు. 28

తే. సత్యమడుగంటె శౌచంబు సమసిపోయె
దాన ధర్మము నామ మాత్రంబు లయ్యె
తపముతో జప మస్తంగతత్వమొందె
శమ దమదయాదులిల నిరస్తంబులయ్యె. 29

వ. జనులతి మంద మతులయి కార్య సిద్ధిగానక పరువులిడుచు మంద భాగ్యు
లగుచు బలు శోకల శోవ జాతురు మఱియును. 30

తే. పరమ పాషండ విరతులై బరగువార
లరయ సమ భావులైన సత్పురుషవరులు
కులము గోత్రంబు గానట్టి కులట పొందు
కలుగువారలె భక్తాగ్ర గణ్యులవని. 31

తే. కూట భాషలఁగాని బొంకుననుగాని
వివిధ దుష్కృత్యములను గావించిగాని
కపట వేషాలు దాల్చియుగాని యెటులొ
కడుపు నిండించు కొనువారె ఘనులు బుధులు. 32

కం. అమిత ప్రేమాస్పదులై
తమినుండగ దగిన యట్టి దంపతులిలలో
దమలోనఁ దామ యొండొరు
గమకింతురు మోసగింపఁ గౌటిల్యమునన్. 33

చ. అరపిన గానరారు కరుణాఢ్యులు చేపదరెందు సత్యవా
జ్నిరతులు లేరు యోగులు వినీతి పరాయణులైన వారు చి
క్కరు నియమాను పాలకులు గల్గరు దారవిసర్గ సద్గుణా
కరులగు వారలొక్కరునుగాని లభింపరు-భూతలంబునన్. 34

ఉ. ఇంతుల పెత్తనంబె యొక యింటను దప్పక చెల్లుచుండు, న
త్యంత దురాశలందవిలి యాత్మజలన్ వెలకమ్ము చుంద్రు, బో
ధింతురు బుద్ధి ప్యాలకులు దేవగృహాంగణ పుణ్య వాహినీ
సంతతు లెంతయున్ యవనజాల విరంతల రుద్ధమైచనున్. 35

సీ. కలిభవానలమున గాలి రూపరి వర్వ
సాధనతతులు నాశంబులయ్యె
వేద విక్రేతలై వివిధ వృత్తు లొనర్ప
దివిరిరి భూసురుల్ తెలివిమాలి
పాడి దప్పి చరించి వణ్యాంగ నా వృత్తి
పరతంత్రులైరి తన్వంగులెల్ల

నతిథి పూజలడంగి యన్న విక్రయశాల
లొప్పారె నొకపల్లె తప్పకుండ
నిట్టి కలి దోషములనెన్ని యేని గనుచు
నవనితలమెల్ల వలగొని యదుకుమార
బాల్యలీలావిలాస, సంభరితమగుచు
వెలగు యమునా తటంబును జేరజనితి. 36

వ. ఓ ముని పురందరులారా ! ఇటులనటకేగి యేనభ్బువనపావన యమునా
తరంగిణీ తీరో పాంతవనంబున నొక యాశ్చర్యంబు గంటి; నది మీదివ్య
చిత్తంబున నవధరింపుడు. 37

సీ. ధరణిగూలిన యచేతనులిర్వు రెలమి, వి
ట్టూర్పు వృద్ధుల కడనున్నదాని
పరిచర్య లొనరించి పరిపరిబోధించి
కృత కృత్యగాక శోకించుదాని
దమిఁ దమనోమ నే ధన్యు లేతెంతురో
యని యెల్ల దిక్కుల నరయుదాని
యోషా శతము సారె యోదార్చి యోదార్చి
చేరి వీచుచు గొల్వు సేయుదాని
దారుణ విషాదఖిన్నయౌ తరుణి నొకతె
గాంచి వనరి డాసిన నన్ను గాంచి లేచి
యనఘ ! క్షణమాగి నా ఖేదమపనయించు
మనుచు వివశయైవేడె నన్నామృగాక్షి. 38

కం. ఘోరాఘవారణంబయి
భూరి శుభాధారమగుచు మోదాకరమౌ
నారయ నీ దర్శనమో
నారద ప్రాక్పుణ్య వశమునంగాకగునే ? 39

వ. సకల భువన భాగ్య సంధాయకంబైన భవద్దర్శనంబున నిష్టావహంబైన
య భీష్టా పాదకంబగుటకేమి సందియంబు. తావక సహజస్నిగ్ధ మధుర

గంభీర రహిత సాంత్వన వాక్యామృతాభిషేకంబున మదీయ చింతా సంతాపంబుపశమిల్లునని తప్పర్థించు నామెంగవి నారదముని కులావతంసంబు. 40

మ. తరుణీ! యెవ్వతె వీవు చేరువదటి త్తన్వంగు లెవ్వార లీ
పరితస్విన్ముఖచేత సొల్లపితులెవ్వారీ మహా వృద్ధులి
ర్వురు నీవెందుఁలదాన, వేమి పనికై పూఁబోణి యిందుంటి, వీ
పరితాపం బిదియేమి? యెట్లొదవె చెల్వా! యన్నిఁటిం దెల్పవే? 41

వ. అనవుడు నత్తన్వి సవినయంబుగా సప్రశ్రయంబుగా సవిస్తరంబుగా స్వకీయోదంతం బిట్లు విన్నవించె. 42

తే. భక్తియనుదాన వీరాత్మ భవులు నాకు
జ్ఞాన వైరాగ్య నామములూను వారు
కాలగతి నంగ శిథిలత గాంచి వీరు
వృద్ధ దశనిట్లు గనుటకే వెత జనించె 43

వ. ఇంక నీ పరిచారికా జనంబు లెవ్వరనిన. 44

మ. పరిచర్యా పరతంత్రులై కడిపి విశ్వాసంబునం గొల్చు నీ
పరమోత్కృష్ట జగచ్ఛుభంకరణ రూపశ్రీల శోభిల్లు పు
ష్కర పత్రాయత లోచనా జనము లా గంగాది పుణ్యాంగనల్
సరవిన్ శ్రేయములేదు నాకు సురపూజ్య స్ఫూర్తి చేకూరియున్. 45

వ ఇంక నా జన్మాదికంబు సాకల్యంబుగా వివరించెద, నవధరింపుము. 46

తే. జననమందితి ద్రవిడదేశంబులోన
వృద్ధి గాంచితి కర్నాట విషయమందు
పాటిలె నొకింతమేలు మరాట సీమ
ఘూర్జరంబున జీర్ణించి కుంటువడితి. 47

మ. కలి యోగంబున జేపి చేవగొని వీకన్ దుష్ట పాషండుఁల
గ్గలికన్ దాడులు సజ్జనావళులపైఁ గావించు నావేశనం

దులనే దైవగతిన్ వసించిన మమున్ దోడ్తో పిలూ నాంగులన్
వలుపన్ మందతగంటి మందిత తనూజాతద్వయోపేతనై. 48

చ. తనువున దుర్బలత్వము, పదంబుల మందత, నాత్మ ఖేదమున్
తనయులతోడ నాకిటులదార్కొని యింతకు నెంతకాలమో
చనె. నటమేముగన్నయగవాట్లవి జెప్పఁగజాలనో తపో
ధన ! ఇటకెట్లు వచ్చితిమొ యాశ్రమ దైవమ యేమి సెప్పుదున్. 49

వ. అట్లు బహుళ శ్రమంబుల యలజడి కోర్చియు దర్కబద్ధాశాపరతంత్ర మాననంబున నీ సమీప భూమికే తెంచి 50

శా. బృందారణ్య మహిన్ బదంబిడితినో యింకేవియున్ లేదొ, యం
తందో తెంచె విభావనీయ సుషమాతారళ్య లావణ్య మా
సౌందర్యం బట దోడు తోడ నొదవెన్ సర్వాంగ తారుణ్యల
క్ష్మిం దీపించెడు నూత్నయౌవనము నామేనన్ విశేషంబునన్. 51

వ. ఇది బృందావన మహిమంబు దాన నీనాడు నవయౌవన రూపవిభ్రమ కళా సంపన్ననై యున్నదాన, వింకవీట బాపి దేశాంతరంబున కరుగు తలంపు వొడముచున్నయది అదియుంగాక. 52

సీ. పూవ ప్రాయమునంద ముదిపి శయానులై
యలమట వందురి నలుగుసట్టి
నాకన్న కొడుకులకీ కష్టము, లికెంత
కాలమంచని యోర్వగలుగుదాన
జగతినెందైన నను జనవి కంచెను దనూ
భవులు కొండికలుగా వలయుగాదె
మువ్వుర మెడబాటు బొంది యెఱుంగము
విపరీతమిట్లేల విధి ఘటించె
కౌమరు ప్రాయంబు నాకు జేకూరి సుతులు
పూర్ణ యువకులు వృద్ధులై పోవనేల
తలచి వెఱగంది మదిఁ గుంది తల్లడిల్లు దు
దెఱపు మేదైన హేతువు దీవికున్న. 53

వ. అని ప్రార్థించిన భక్తి దేవింగని నారదుండు కరుణాంతరంగుండై, ప్రమోద ధైర్యోత్సాహంబు లంకురింప నద్దేవి కిట్లనియె 54

మ. తరుణీ! నీ మదిలో రవంతయు విషాదంబూనగా బోకు శ్రీ
హరి నీకున్ సుఖమీయగా గలడు నేనాత్మన్ సమస్తాంశమున్
బరిపూర్ణంబగు జ్ఞానదృష్టిఁ గని నీభావి ప్రకారంబు, వి
స్తరతం దెల్పెద సావధానముగ నాస్థన్ సర్వమాలింపుమా. 55

వ. అనిక్షణమాత్ర నిమీలిత లోచనుండై తన దివ్య జ్ఞానంబున సకలంబు తేట తెల్లంబుగా నెఱింగి, భావికాల భవదీయగతి వినుమని యిట్లనియె 56

ఉ. భీకరమర్త్య పాకృత వివేక వినీతి దయాది సద్గుణా
నీకము భూతదేవ పితృనిత్య నిమిత్తము భాగమ క్రియో
త్సేకము, ధ్వస్తయోగిజనశీల తపోవ్రత సత్యదాన, సు
శ్లోకము నైగడంగి కలిఁజొచ్చి వెలింగె, నవార్యమై మహిన్. 57

వ. మరియు నీ వసుమతీ తలంబునం గలుగు సకల పవిత్ర సాధనంబులు కలి ప్రకర్షంజేసి నానాటి కత్యంత హేయంబు నొందుచున్నయవి. 58

సీ. సత్యంబు జెల్లదు జపము రూపఱి బోవు
కుల సదాచారముల్ కలతనొందు
యోగ సమాధుల యుద్యోగములు మాను
సాత్విక సంపత్తి సన్నగిల్లు
దుష్కృత్యముల కేపు దొరకని పెంపూను
సత్క్రియా కాండముల్ నమసిపోవు
ఘోరా సురాయితుల్ కుమతులై జనములు
చౌర్య దుష్కర్మముల్ సలుపు చుండ్రు

సుజనులాపద నొందుచు స్రుక్కుచుంద
రిట్టి కలి పేర్మి కెవని భీతి నెనయ నీక
తివిరి తన పూన్కి కొనసాగదీర్చుకొనెడు
వాడె ధీశాలి, ధీరుఁడు పండితుండు. 59

వ. ఇట్లు బహుళాపాయ జనకంబగు కలి ప్రవర్షంజేసి. 60

మ. అతివృద్ధింగను నీయపాత్రుల నితాంతా స్పృశ్య పాషండ సం
హతులన్ గాంచుచు మోయుచున్ స్వపృధు మహాత్మ్యంబు
గోల్పోయియున్
క్షితిశేషాహి ఫణాసహస్రములకున్ జేకూర్చు భారం బొగిన్
బ్రతివర్షంబు విరక్త పుణ్య తమ సౌభాగ్య క్రియాహీనయై. 61

మ. అనురాగాంధుల యొల్లఁబాటునఁ, గుమారాన్వితవై నీవు నా
య్యన శుష్కించిన దానవట్లు మరి బృందారణ్య సంప్రాప్తి నూ
తన తారుణ్య తరంగితాంగివయి వత్సా! ఇట్టులున్నావు, పా
వన బృందావనమెంత ధన్యమట భక్తి క్రీడ లొప్పారెడున్ 62

వ. అని మరియును 63

కం. ధర నిన్ను నీ కుమారుల
బరికింపగ జాలునట్టి పరహితమతులె
వ్వరు లేరుగాన దేశాం
తరమేగక, నివసింప దనరున్ శుభముల్. 64

తే. వీరిఁజేరంగదీసి సంప్రీతి జేయు
వారలిందైన లేకున్కి వీరిముదిమి
వదలదైన నింటుంటయే పరమహితము
కొంత సుఖ నిద్రయైన జేకూరు నిచట 65

వ. అని నారదుండు భక్తి కెఱింగించి, యన్యదేశ గమనాభిలాషంబు నివర్తింప
జేసిన వద్దేవి బరమ పావనంబై నిత్య సౌఖ్యా పాదకంబైన బృందావ
నంబు నంద నివసింప నిశ్చయించి మరియు నతనిం గని. 66

చ. ఘనుడు పరీక్షితుండు కలిగాంచి యడంపక నేల నిల్పె, నా
దనుజకులాంతకుండు హరి దాగని యేటికి మిన్నకుండె, నె

ట్టిన కలిరాక సారములడంగుట దేమికతంబొ యిన్నిటిన్
వినుచుము తాప కోత్తులను వేదనదీరి సుఖాత్మ నయ్యెదన్. 67

వ. అవి వేడిన దేవి భక్తి పలుకు లాకర్ణించి నారదుండు వెండియు
విట్లనియె. 68

మ. చెలువా! ఏ పదుదంతమున్ వినగ నీ చిత్తంబునం దెంచి య
ర్మిలి ప్రశ్నించితివా సమస్త మిదె నెమ్మిన్ నీకు వాక్రుత్తు యు
త్తిలి ప్రేమన్ వినుమాపదల్ దలగు నమ్మీయంచు దేవర్షి ని
ర్మల వాక్యార్థ రస ప్రకర్ష చెలువారన్ బల్కె నీ తీరునన్. 69

చ. చెలువగు శ్రీవికుంఠపురి జేరగ మాధవు డెన్నడీ మహీ
స్థలి విడె నాటగోలె మహిత ప్రథమాన విశిష్ట సాధనం
బులగల సర్వసారముడివ్వోయి యధర్ముడు బీటవెట్టి దె
క్కలి కలిదా పురించె ఖలకామిత పూర్ణ ఫలప్రదాతయై. 70

వ. భూలోకంబట్ల వారణ గలి ప్రవేశించి యవినయ హింసాన్యాయాసూయా
క్రోధ కుటిల మాత్సర్యాదుల ప్రజా బాహుళ్యంబున ప్రవర్తింపజేయుచు
విచ్చల విడి సంచరించుచునొక్కనాడు. 71

చ. అలఘు మహీశలాంచన సమగ్రుడు గోద్విజ సాధు సజ్జనా
కుల కరక్షైక శీలుడతి ఘోరుడు శూద్రుడు దండ హస్తుడై
తలకి వృషా కృతిన్ మెలగు ధర్మ బదంబున దమ్మిమన్న న
క్కలిగనె రాజు దిగ్విజయ కాలమునందొక చోటనుగ్రుడై. 72

వ. కవియక్కురు వంశ భూషణుండు ధర్మద్రోహిపై హుంకరించి పోకు
పోకుమని ప్రచండరయంబున డాసి. 73

మ. అతిలోక స్థిర సత్య విక్రమ కురుక్ష్మాధీశ సంపాలిత
క్షితి నెవ్వండిటు నీవెకాకొరు దెటం జేయంగ, మున్గంటె? దు
ర్మతి శిక్షార్హుడవీవయౌ దగునె! యౌరా! గోవృషోత్తంసమో
పతితా! నిన్ సమయించి యీ జగము నిష్పాపంబు గావించెదన్. 74

వ. అవికోపాటోప సముద్దీపిత కరాళ సంసక్త రక్త నయన కోకనదుండై, యుద్దండ దండధర ప్రచండమూర్తియై యక్కూరు కంఠీరవుండు బెడిదంబుగా నడిదంబు కేలన్ గమిచిపట్టి.

మ. పొలియింపన్ సమకట్టి పై దొడరి పోబోవంగ నావీచుడు
త్తల పాటొప్ప నృహాకృతిన్ వదలి హస్త ద్వంద్వమున్ మోడ్చి బె
గ్గిలి పాదాబ్జములంటి దీనువి గటాక్షించంగదే దేవ! యీ
కలినంచున్ ప్రతిమాలె; దీనుడు బలెన్ గౌరవ్య చూడామణిన్. 75

వ. ఇట్లక్కలి నిజప్రాణావన పరాయణత్వంబున శరణాగతుండై యక్కురు కులాలంకారుతో పరమ దైన్యాను నయ పూర్వకంబుగా నిట్లనియె. 76

కం. కాలక్రమమగు ధర్మము
వాలాయముజెల్లి తీరవలసిన యదిగా
గాలాత్మకు నియమంబది
యీలాగున జెల్లనుంట నిటులొదవె నృపా. 77

వ. కావున శరణాగత రక్షా పరాయణ! కౌరవకుల కలశ జలనిధి సుధాకరా! ఈ శరణాగతు క్షమించి విడిచి పుచ్చుమిక మీద, నీ ముదల యట్లట్ల వినయ వినమ్రుడనై వర్తించగలవాడ. భగవదంశ సంభూతుండవగు నీ యాజ్ఞను పాలనంబు నాకు విహితంబైన పరమ కర్తవ్యంబు. నా పూర్వ వాసనా విశేషంబున నీ సువిశాల భగవత్సృష్టియందీయ కార్యా చరణంబుల కేను దక్కొరులు జాలరనునట్లు నియమింపబడితి. ఈ ఘోరంబు భవత్కృపా విలసనంబున గొంతకాలంబైన దప్పె. నేను బరమ ప్రమోదంబున సుఖంబుండు; తెగం జూడకుమో దేవా! అని పరమ కరుణంబుగా ప్రార్థించిన కలి విన్నపంబు సాకల్యంబుగా నా కర్ణించి, నెమ్మనంబున చర్చించి. 78

చ. అలఘు తపస్సమాధులు జపాదులు యోగము లాచరించియే
నలవడలేని ముక్తినెనయంబడు శ్రీహరియన్న మాత్ర వి
క్కలినని యెంచగాచె మహికాంతుడు ద్రుంచుట పాడిగాదటం
చలధున దేనెనాపియాళి యవ్విరి నొంపవి పోల్కినాతనిన్. 97

చ. అరయన సత్క్రి యాకృతి బదార్థము సర్వము సారహీనమా
తరిగత బీజమౌ(దుష విధంబమరన్ గలిసేతనిట్టి దు
స్తర బహుళ ప్రమాద భరితంబయినన్ గలి పారవంత మం
చరపి యెవిల్పెరాజు కలినాఖిల లోకహితైక కాంక్షతోన్. 80

వ. అవి కలి వృత్తాంతంబు దెలిపి మరియు గలి సేన్మినొదవు విశేషంబుల
నెఱింగించువాడై నారదుండు భక్తి కిట్లనియె. 81

ఉ. పారులు ధర్మ దూరులయి పాడు ధనంబున కాశజేసి సం
సార విరాసకంబయి ప్రశస్త తమంబగు నిత్యభూతి న
వ్వారి గనీయ జాలు భగవత్కథ లొక్కొక్క యింటికేగి, వే
సారక చెప్పుచుండుట ససారము గాంచె గథా ప్రపంచమున్. 82

ఉ. మాయికులై యవైదికపు మార్గములైన మహోగ్రకృత్యముల్
పేయుచు సజ్జనాపకృతి జేయుచు నాస్తికులైన దుర్మతుల్
వాయక పుణ్య తీర్థముల వాసము జేయుటజేసి యెన్నదో
పోయెను ధారుణిన్ వదలి పూతతదద్భుత సారమంతయున్. 83

శా. కామ క్రోధ మదానురాగయుతులై గర్వాభిభూతాత్ములై
నేమజ్ఞాన శుచిత్వ శీలనయముల్ విర్జీవముల్ జేపి వి
ప్రైమిత్యంబున దుష్ట మానసులు తృష్ణాలోల సంకల్పులై
తామెంతే దపమాచరించ జనెదత్సారంబు సర్వస్వమున్. 84

మ కపటంబున్ మద లోభదంభము లహంకారంబులన్ బుద్ధిలో
నపనోదింపగ లేకనే యకృత శాస్త్రాభ్యాసులై మానసం
బపకర్షించి జయించ లేక శృతి బాహ్య సక్తులౌ పాపుల
ప్రపయోగంబొనరింప బూనజనె దత్సారంబు సర్వస్వమున్. 85

సీ దున్నలవలె సుధీంద్రులు కళత్రములతో
విధు వనోత్సవముల నెఱపుచుండ్రు
సుత సముత్పాదన కతి వమర్థులెగావి
ముక్తి సాధనము కళత్రుబరయ

సత్సంప్రదాయాగ్ర సరులగు వైష్ణవుల్
పాటించి కవిన నెచ్చోటలేరు
వస్తు సారంబెల్ల బ్రకటయత విటుగనె
ధర దేశదేశంబు దప్పకుండ

యుగని సర్గ ధర్మమిదిగ, యొకరినింధు
వింధసేయంగ దగు హేతు వెందు గలుగు
వందుచే నకారణ కరుణాగ్ర గణ్యు
దైవ శ్రీపతి సతము నీతోనమెలగు. 86

కం. అనినన్ సురముని పలుకులు
విని భక్తి మదిన్ వితాంత విస్మయ మతియై
మునితో దెలిపిన యంశము
విను శౌనక దాని నీకు వినిపింతు దగన్. 87

వ ఇట్లు నారద ప్రబోధితమై భక్తి దేవి విశ్వాస పురస్సరంబుగా నతని
ప్రశంసించి. 88

చ. అమర మునీంద్ర ! నీవతి కృతార్థుడవెంతయు మత్ప్రి భూత భా
గ్యమున భవత్స మాగమముగల్గెను ధన్యత గంటి నీకృపన్
భ్రమదమెసంగె సాంప్రత మవశ్యము నాకిది సుప్రభాతమౌ
నమధిక సాధుదర్శన మొసంగగ జాలదె సర్వసిద్ధులన్. 89

మ. ధృవమై యొప్పు పదంబు నొందెను ధృవుండెవ్వాని దివ్యత్కృపా
లవ పాతంబున మాయగెల్చె మును ప్రహ్లాదుండునే పుణ్యవై
ష్ణవు బోధామితశక్తి నట్టి త్రిజగత్కల్యాణ దాయిన్ జగ
ద్భవు కాపాడకు బ్రహ్మపుత్రునతి విశ్వాసంబునన్ మ్రొక్కెదన్. 90

వ. అని యామువి సత్తమున కభివాదనంబు గావించి, జ్ఞాన విరక్తులపాటుగని
పలగతులందలబోపి, దలబోసి, వసవుచున్న భక్తింగని నారదుండూ
రార్చుచు నిట్లనియె. 91

ఉ. వారక ఖేదమందెదవయో యిటు చింతిలనేల ద్రౌపదిన్
గౌరవదుష్కృతిన్ దలగ గాచిన వాడెటు పోవలేదు. ర
క్షారతి గోపికావనజ శౌరణబంధుడు కృష్ణుడున్న, వా
డారయమాని, వాని చరణాబ్జములన్ స్మరియింపు మేలగున్. 90

మ. ప్రణుతై కావనుడైన మాధవునకున్ ప్రాణాధిక ప్రేయసీ
మణివౌదీవు కరమ్మునమ్మ విను ప్రేమంబార కృష్ణుండ పా
రణ సామాన్యుల యండ్లకైన జను విప్రానీకముల్ సంపద
గ్రణులన్ బిల్చిన బోవనొల్లని యలోక ప్రాప్యుడుత్సాహియై. 91

తే. మొనసి సత్యాది యుగముల మూటియందు
జ్ఞానవైరాగ్యములు ముక్తిసాధనములు
కలిని భక్తియె సుమ్మ కేవలముగాగ
బ్రహ్మసామ్రాజ్య మొసగు నుపాయ మరయ, 92

తే. జ్ఞానగమ్యుండు చిన్మయాకారు డాత్మ
విశ్వసించిన రూపుగ నిను సృజించె
విశ్వసంభావనీయ పవిత్రమూర్తి
కృష్ణవల్లభ సుందరి ప్రేమమయివి, 93

వ. పరమాత్మ సంకల్పసంభవవైన నీవు నిన్ను మరచి కొంత కాలంబు చనిన
మీద నొక్కనాడు. 94

కం. మనమున నిను సృజియించిన
వనజోదరు జేరి భక్తి భావిని వగుచున్
బనియేమి యనుచు నీకర
వనజంబులు మోడ్చి యతని బ్రార్థించుటయున్. 95

కం. హరి వినుగని నాభక్తుల
బరిపోషణసేయు మనుచు బనిచియు మది నీ
యురరీకృతి కలరి యొసగె
పరిచారికగాగ ముక్తి భవదర్థంబై. 96

వ. మఱియు నతండు నీ సహజస్నిగ్ధ ప్రేమౌదార్య వినయాశ్వాసాదుల కలరి. 97

చ. తనయుల గాంచి విద్య రసదారుల జ్ఞానవిరాగ నాములన్
గొనుమని ప్రేమచే నొసగ కూరిమిఁగైకొని వారలం బ్రియం
బొనరగ నైజరూపమున నోముచునుంటివి శ్రీవికుంఠ ప
త్తనమున బెద్దకాలము ముదంబున ముక్తిభజింప బ్రీతితోన్ 98

వ. వదంపడి కతిపయకాలంబు గడచిన మీద నీవు భగవదాజ్ఞాపితవై శ్రీ
వైకుంఠపురంబు వాసి. 99

శా. ఛాయారూపము బూని యీ వసుధపై సద్భక్తి పెంపూనగా
జేయన్ జ్ఞానవిరాగ ముక్తులెలమిన్ సేవించుచున్ దోన, వి
చ్చేయన్ మేదినిఁ జేరితుంటివి సుఖశ్రీలొప్పగా మున్ను భ
క్తీ! యాది, త్రియుగంబు విందుగ సమాప్తింజెందు పర్యంతమున్. 100

కం. కలిపాషండా మయములు
దలకొని క్షీణించ ముక్తిదళగని నీవే
సెలవీయ నామెజనె, సు
జ్జ్వలత మరల శ్రీవికుంఠ పత్తనమునకున్. 101

తే. భక్తి నిను మీవు నిన్నెంచు ముక్తి నీకు
నెప్పుడు దాస్యంబు నలుపన నెడద దలచు
నీవు రమ్మన్న నియ్యెడ కేగుదెంచు
జనుము నీవన్న వెంటనే! జనును మరల. 102

చ కడగి నతంబు పజ్జనిడి కాచెడు నీసుత విద్యశేషు లి
య్యెడగల దుర్విదగ్ధ జనులెల్ల దమం బొనరించు దాన వి
బ్బడుగు దనాన వృద్ధదశబాయగ నేరరహైన నేమి నీ
వుడుగుము చింత దీని కనువొందు నుపాయము నేనొర్చెదన్. 103

చ. కలినెవయుంగ నేయుగముగాని మఱొండికలేదు గాన న
క్కలి వినః వింటవింటమ దగం, గనకొక్కని మాననంబునన్

దలకొన జేయనేని బెరధర్మము గాదని నీ మహోత్సవం
బుల నెఱకొల్పనేని, నెటులో హరిదాసుడ నంచు నేనికన్. 104

సీ. పరమభక్త్యనురక్తి బరిగిన జీవులే
కలిలోన బుట్టువు గాంచగలరు
భయమింతయును లేక పాపులైననుగాని
కృష్ణాలయంబులకేగ గలరు
ప్రేమరూపంబయి విలసిల్లు సద్భక్తి
నెవ్వారి యాత్మల నివ్వటిల్లు
నా మహా విమలాత్ము లగు వారలించుక
కలనైన గీనాకు గానబోడు

ప్రేతసుర రాక్షస పిశాచ భూతచయము
లైననగుగాక వారల యాత్మలందు
భక్తిగలవారి పుణ్యసంస్పర్శ చేత
యెట్టివాడైన ప్రభువయి యెసక మెసగు. 105

చ. తపమున జ్ఞానయోగమున ధ్యానమునన్ మరియున్ మఖాదులన్
జపమున బ్రహ్మచర్యమున సత్క్రతులన్ మఱిదేననైన సా
ధ్యపడని యా రమేశుడు దయాంబుధి కృష్ణుడు సాధ్యమౌ గదా।
యుపచయ భక్తికిందు కమవొందు ప్రమాణము గోపసుందరుల్. 106

ఉ. ఆయత పూర్వజన్మ సుకృతాతిశయంబున గాన భక్తిపై
వేయి భవంబు లందొకట ప్రీతి జనింపదు మానవాళికిన్
హేయ గుణాకరంబయిన యీ కలి భక్తి భవాబ్ధి తారణో
పాయము భక్తిగల్గ భగవంతుడె చేరువమందు కృష్ణుడై. 107

కం. అపకృతి భక్తి కొనర్చెడు
కృపణుడు ముజ్జగములందు గీడొందుమమున్
జపలత భక్తిన్ దెగడిన
నెపమున దుర్వాసుడొందె నిఖిలాపదలన్. 108

ఉ. చాలవు మంత ముక్తిని నొసంగగ జ్ఞానముఖైక చర్చలున్
జాలవు సర్వయోగములు జన్మములన్ జపముల్ వ్రతాదులున్
జాలవు వేదపాఠములు జాహ్నవిముఖ్య పవిత్రవాహినీ
జాలములెల్ల భక్తియ యొసంగగ జాలును ముక్తి నీ కలన్. 109

మ. అని దేవర్షివరుండు దెల్ప దనమాహాత్మ్యంబు నాలించి సొం
పనుపారన్ సకలాంగవృద్ధిగని యమ్మోనీంద్రుతో భక్తి యి
ట్లను ధన్యాత్ముడవీవు నీవిమల దివ్యప్రేమమీరీతి యొ
ప్పునె నాపై మునివర్య నేనిపుడు సమ్మోదంబు మై నుండెదన్. 110

వ. అని యవ్వేలుపుం దపసిని సన్నుతించి. 111

ఉ. సాధుకులావతంస! మునిసత్తమ! నీ యనుకంపజేసి నా
బాధ దొలంగె గాని యిటుబడ్డ యచేతనులైన వీరి సం
బోధనమాచరించి కృప బ్రోదియొనర్పగదే జగత్సమా
రాధనకేళిలోల! అశరణ్య సముద్ధరణైకవత్సలా! 112

చ. అని తనభక్తివేడ విని యక్కటికం బెదగూర నారదుం
డనుపమ బంధుభావ మలరారగ వారివిడాపి కేలుద
మ్మిని మెయినల్లనన్ నిమిరి మేల్కొను; జ్ఞానవిరాగ మేలుకొ
మ్మని చెవి బేరెలుంగు నొలయం బిలువన్ బిలువంగ నత్తఱిన్. 113

తే. సామ వేదాంత గీతాది సరసమధుర
గానములగాక మేల్కొలు గలుగనట్టి
వారు మేల్కాంచి యాయాసపడుచు నెట్లొ
కడగి యా నారదాహ్వాన గౌరవమున. 114

సీ. కనులు విప్పి యొకింత గాని కావగలేక
యొదలిపై స్మృతిదప్పి యున్న వారి
నతిశుష్క కాష్ఠోప మాంగకులై నేల
కొరిగి వికాకృతి నున్నవారి

నలిరేగు నాకటి నలకుక మై దను
    వైన గదల్పగ లేనివారి
నలము పేరలసత నావులించుచు దూలి
    దూగాడు నిద్దుర దోగువారి
జ్ఞాన వైరాగ్యలను గాంచి జాలినొంచి
యకట! నీ ముది నీ నిద్ర నందు టేమి?
అనుచు జింతించి సురమౌని యాత్మదలచె
బరము రాము పరాత్పరు భక్తవరదు. 115

వ. ఇట్లు తదీయోద్ధరణార్థం బత్యంత వ్యగ్ర మానసంబున విశ్వైక భక్తి భావనం బరబ్రహ్మంబును సంస్మరించి నంత మధుర గంభీరంబయిన యొక్క యశరీరవాణి యంబర మధ్యంబు వెలువడి యెల్లరు విన. 116

మ. కలిగం బోకు ఫలించు యత్నమొక సత్కర్మంబు గావించు వీ
రలకై దానివచింత్రు సాధులది నిర్వర్తించు నట్లైన వే
దొలగున్ వీరికి నిద్రతో ముదిమి దోడ్తోడెంపగున్ భక్తి న
ర్మిలి నో నారద యన్న బల్కొకటి బర్వెన్ మింట బేరెల్గునన్. 117

సీ. ఆ యాకసపు బల్కు లటగల యందరు
    నధిక మోదంబున నాలకించి
రదియేమొ యెరుగవా కలవిగాదని పల్కె
    నహ్మనీశ్వరు డబ్బు రమ్ము నొంది
యే సాధనమున మే లెనయునో వీరికి
    నేది కార్యముగా గ్రహించ నగునొ
సాధువు లెక్కడ సమకూడుదురొ యాయు
    పాయము వారెట్లు బలుక గలరొ
ఇందు నాముఖ్య కర్తవ్య మేమి యనుచు
వారి నిరువుర నందుంచి నారదుండు
దాని సమకూర్చుకొను పూన్కి దవిలి తరలి
నిఖిల తీర్థాల వెంబడి నెమక జనియె. 118

వ. అట్లు నారదుండు తదీయ సముద్ధరణంబు పొంటె నాకాశవాణి యాదే
శించిన విగూఢ వచనంబున కర్థంబు దెలియ వేదతత్త్వసాధుసందర్శనంబునకై
వసుమతిం గల పుణ్య నదీ నద వన పర్వత దుర్గక్షేత్ర తపోధనాశ్రమాదుల
మన్నగు పావన ప్రదేశంబుల గలయం ద్రిమ్మరుచు నయ్యైతావుల నగపడిన
దాపసులకు దనవచ్చిన కార్యం బెఱింగించుచు నెందునుం సంశయ నివృత్తి
గామికి పలుతెఱంగుల బలుతావుల శేగు చెందు నయ్యెచోటుల. 119

మ. అమరర్షీంద్రుడు వచ్చెనా విని మునిస్తోమంబు యోచించి యే
కరణిం జూచ్చవి యించుకైన నుడువంగా బూనలేరయ్యె బె
క్కుఁడు మూకత్వము దాల్చియుండిరి మహా గూఢార్థమంచన్యు ల
త్తరముం దెల్పిరి కొందరాడిరి యసాధ్యంబైన దంచప్పుడున్. 120

మ. అవధానంబు లభించమిన్ దురవగాహంబైన దంచొక్క మౌ
ని వచించెన్ శర తాపసుండధిక దుర్జ్ఞేయంబునన్ సాధు పుం
గవుడొక్కండు దురూహమంచనియె నింకన్ బెక్కుయోగీశ్వరుల్
దవులం గాంచి పలాయనైక పరతంత్ర ప్రాణులై రత్తఱిన్. 121

మ. అమరర్షీంద్రుడు వచ్చెనా విని స్వకీయస్వ స్వయుక్తంబు స్వా
శ్రయముల్ మున్న దొరంగి చెట్టుకొకరై త్రాసంబునం బారి ర
న్య మునీశుల్ సమయోచిత క్రియల నయ్యైరీతులన్ యుక్తియు
క్తముగా నాపద దాటనెంచిరి నిజత్రాణైక మంత్రంబులన్. 122

చ. అటువిని దారి తన్నెఱుగనైనను జాలక భ్రాంతచిత్తులై
యటువలె బారు మౌని నివహంబుల గాంచి తపస్వులార మీ
రెటు జనుచున్నవార లిటులేటికి నావుడు వారు నారదుం
డటులరుదెంచె నావిని యంతన వీరును బారిపఱ్కుటన్. 123

వ. అంత నొక్క తపోధనుం డమ్మునీంద్రులం గని యో మహాత్ములారా!
అవధరించెదరే యని వారలకిట్లనియె. 124

సీ. కమనీయ సుస్వర ఘనపద క్రమజటా
వేద మంత్రంబుల వినికి వలన

మంత్ర మంత్రార్థ సంబంధముల్ దెలిపెడు
నుపనిష దుక్తుల యులివు వలన
పాప్య సంప్రాపకో పాయముల్ వివరించు
సవ్యగాథా కీర్తనముల వలన
నాస్తిక్య సంహాద నాతి ధురంధర
బ్రహ్మ సూత్ర ప్రచారముల వలన

నిత్య జాగ్రత్స్వ భావులై నెగడినట్టి
ముడిపి జ్ఞాన వి రాగు లెప్పుడును గాని
నిద్రయే దప్ప మెలకువ నేరకున్న
వారలట నిదియేమి దెప్పరమొ గాని. 125

కం అవి మొకముని యొక మునికిన్
వినిపించగ నతడెఱింగి వేరొకనికి జె
ప్పిన నీ నా చెవులంబడి
వినబడె ముల్లోకములను విస్మయకరమై. 126

వ. అట్లు నారదప్రశ్న, క్రమ క్రమంబుగా ద్రిభువన వ్యాప్తంబయ్యె నా సమయంబున నందందు పుణ్య నదీనద వన దేవాయతన దివ్య క్షేత్రాదికంబులం గల తాపసోత్తము లొండొరుం గడిసి తమలో దా ము - 127

మ సరసీజాసన! మానసోద్భవుడు విజ్ఞానైక ధామంబు శ్రీ
హరి దివ్యాంఘ్రి సరోజచింతనుడు నిత్యైకాంత భక్తుండు నా
సురమౌనీభ్యు డెఱుంగడన్న యెడ నెచ్చోనైన మర్త్యాళికిన్
దరమౌనే గగనోక్త సూక్తి కగు నర్థంబున్ వివేచింపగన్. 128

వ. అని సమాశ్వాసంబు గావించు కొనుచుండిరి అంత నారదుండు తన కార్యసిద్ధి గానమికి జింతించుచు, నా యా తీర్థంబులం గ్రుమ్మరుచు విధివశంబునం జేసి.

మ. బదరీకానన సీమకేగి యట దత్ప్రాప్తి ప్రకారాంతరం
బెదియే నన్యము గానరామిని దపంబే జేతునం చూని నా

రదుడున్నంత పరస్సహస్ర తపన ప్రద్యోత మానాంగు, ల
భ్యుదయోదారులు సాధువుల్ సనకముఖ్యుల్ రాగనెన్ జెంగటన్. 130

వ. అట్లు విచ్చేయు సాధుసత్తముల కెదురేగి నారదుండు సమయ సముచిత ప్రణామాదికంబు లొనర్చి, స్వాగతంబడిగి, విహితార్చనాద్యుపచారంబులు, నిర్వర్తించి, యానంద బాష్ప పూరిత నయనుండును, పులకిత గాత్రుండును ప్రేమ ప్రసన్న హృదయుండునునై, లోక సౌభాగ్య సంధాన పరత్వంబున, సత్కుమార తాపసుల నుద్దేశించి. 130

సీ. చిరపుణ్యవాసన జేకూరె నాకిందు
భవదీయ దర్శన భాగ్య మిపుడు
బుద్ధిమంతులు తపోధనులు బహుశ్రుతుల్
జ్ఞాన యోగానంద సాంద్ర మతులు
పంచ హాయన వయః పరిభాస మానులు
నాద్యులకుం గర మాద్యతములు
చిరకాల పరిపాటి జెందిన వారలు
మదిలేని మనసుల బొదలు వారు

సతత వైకుంఠ నిలయులు చక్రి నామ
నిరత కీర్తనా భిరతులు హరి మనోజ్ఞ
భూరి లీలాసుధారస స్వైర పాన
పరవశానంద విహ్వృతులై బరగువారు. 132

సీ. భువిగూలి రెవ్వాని భ్రూ భంగమున దొల్లి
వాసుదేవ ద్వార పాలవరులె
కల్మషంబు లడంగి కవిరి నిజస్థాన
మెవని కృపాదృష్టి యెనయు కతన
మాధవ సత్కథా మాత్రైక జీవన
మే ప్రొద్దు గావింతు రెవరు ప్రీతి
హరిరేవ శరణ మస్మాకమ్మనెడు పల్కు
నిరత మెవ్వరి నోట నిగుడు నట్టి

మీ యుదార సమాగమా పేయ ఫలము
పరమ సౌభాగ్య వశమున బడయ గల్గె
కృపణు, దయనీయు నను దీను దయగమందు
శ్రిత శుభాపాద నానక్త చిత్తులారా। 133

వ. అని ప్రార్థించి. 134



మ. స్థిరమౌ సౌఖ్యము తుష్టి పుష్టి యును భక్తిజ్ఞాన వైరాగ్య లే
కరణిం గాంతురు సర్వ వర్ణములలో గాఢంబుగా వారి నే
సరణిన్ స్థాపన జేయవచ్చునొ। యనుష్ఠా నార్హసత్కర్మ యం
బరవాణిన్ వచియించినట్టి దెదియో వాక్రుచ్చి రక్షింపరే 135

వ. అనిన సురవాచంయమి వినతి నంగీకరించి కుమార మునివతంసులు 136

తే. ఓయి సురమౌని వర్య! ధన్యుండవైతి
మింక జింత సేయకు మాను, మెవఁడుదంబు
కలుగు వింతకు పూర్వమె సులభ సాధ్య
మై యెనంగెడు పావనోపాయ మొండు 137



మ. వ్రతచూడామణి। యోగిభాస్కర। విరక్తగ్రామణీ। యన్యదు
ర్మత నీహారపతంగ! భాగవత ధర్మస్థాపనాచార్య। పూ
జిత శ్రీకృష్ణ పదాబ్జ సేవక జన శ్రేణీ శిరోభూష! యో।
పతితోద్ధారక। నీ ప్రయత్నమది విస్మృత్యూహమై గ్రాలెడిన్. 138

ఆ. ఓపి భక్తికిట్టు లుపకృతి గావించు
నీకు వింతగల్గ నేరదెందు
కృష్ణ భక్తతతికి కేవలంబుగ జెల్లు
వసుధ భక్తినతము పాదు కొల్ప 139

ఉ. కాదనకింతపాటి యుపకారము భక్తికి నాచరించు నీ
కేది యసాధ్య మారయగ। నెందు విచిత్రములేదు భక్తి వి
త్త్యోదయ మందునట్టు లనువొంద ప్రతిష్ఠ నొనర్పగల్గు శ్రీ
యాదవవంశ వారిధి సుధాంశుని కృష్ణుని దానకోటికిన్. 140

ఉ. లోకమునన్ మహర్షు లతిలోక పథంబుల నేకవై ఖరుల్
వాకొని యున్నవాస దలపంగ నవెల్ల క్రియాన సాధ్యముల్
నాకఫలప్రదంబు లయినట్టివెగాని వికుంఠ పత్తన
శ్రీకర రాజమార్గమది చేరువ యయ్యును గోప్యమై తగున్. 141

సీ. స్వాధ్యాయ యజ్ఞంబు జప యజ్ఞమును దపో
యజ్ఞంబు లెల్లను నరపి చూడ
కర్మ సూచకములు ఘన భాగవతమునే
జ్ఞాన యజ్ఞంబని జగతి నంద్రు
శుకముఖ పరిగీత సురుచిర శ్రీభాగ
వత కథా లాపంబు వలన మిగుల
భవ్య భక్తి జ్ఞాన వైరాగ్యముల కతి
బలము చేకురు కష్టములు దొలంగు

భక్తి కత్యంత సౌఖ్యంబు పరిఢ విల్లు
దృప్త మృగరాజ గర్జన వృకములట్లు
ప్రళయమును గాంచు కలిదోష పటలమెల్ల
భాగవత కథ వినద సంశ్రవణ మాత్ర. 142

ఉ. జ్ఞాన విరక్తులంబెరపి జానయి ప్రేమ రసార్ద్రియౌచు బెం
పూను సమగ్రభక్తి భువినొక్కొక గేహమునన్ జనంబు నం
బూని ప్రభూతమోద మెద బొంపిరి వోవగ క్రీడసల్పు నో
మౌనికులేంద్ర ! భాగవత మంగళ మంజుల ఘోషణ శ్రుతిన్. 143

సీ. వేద వేదాంత గీతాది గాన విశేష
ములగాక మెలకువ గలుగునట్టి
భక్తియు జ్ఞాన విరక్తు లిమ్మువ్వురు
వితర రీతుల నెన్ని యేవిగావి
జేపిన బోధము జెంద నేరవివారు
భాగవ తాలాప వశత నెటుల
మెలకువ గాంచగా గలరాగ మార్గము
పద్య పద్యమ్మున పద పదమున

నొదవు నెట్లను సంశయ మడుగ దెలిపి
యాలసింపక నన్ బ్రోవు డనఘులార!
ఓ యమోఘ దర్శనులైన యోగులార!
ప్రకటిత జగద్ధిత కుశలాకాంక్షులార! 144

వ. అనిన విని కుమార సనకాదులు నారదున కిట్లనిరి. 145

సీ. చెఱకులో చక్కెర చేజిక్కని విధాన
పాలలో నెయ్యి చేబడని పగిది
పలుచోట్ల పలు రూపముల భిన్నముగ నున్న
యాగమోపనిషద ర్థామృతంబు
నెరసువో వడబోయ నెగడిన కూడలి
యత్యుత్తమమ్ము మహా ఫలంబు
దేవతా జనరసో ద్దీపన కారణ
మవితర సులభ ఫలాంచితమ్ము

ప్రౌఢి భక్తి సుజ్ఞాన విరక్తుల విల
పాదుకొల్పెడి తలపున బయలొసర్చ
బరగి కరము భాసిల్లు శ్రీ భాగవతము
నాగమార్థము నుల కేమి యద్భుతంబు. 146

తే. ఆగమోప విషత్స్రుతు డైనవాడు
గీత నొసరించి మించిన కీర్తిశాలి
బాదరాయణు డజ్ఞాన వార్ధి మునిగి
పూర్ణ పరితాప తప్తుడై ప్రొక్కువేళ. 147

వ. అనుపమ తత్వజ్ఞాన సుధానిధివగు నీవతనిం గదిసి సహజకారుణ్యంబున దొల్లి భవద్విరచిత భాగవతార్థ పరిబృంహితంబగు చతుశ్లోకి నుపదేశించుట గాదె కృష్ణ ద్వైపాయనుండు నిర్గతాధియై ప్రశాంత చిత్తుండై శ్రీ మహా భాగవతంబు సమస్త భాగవతోప జీవనార్థంబు గావించె నట్టి యతర్క బ్రహ్మజ్ఞాన సంపన్నుండవగు నీ కీమోహావంసర్గంబేమి? ఎందులకు బ్రశ్నించెదవు. భవత్ప్రకాశిత శ్రీభాగవతార్థ శ్రవణ ప్రభావంబున మంగళ

కలిదోష సంక్రాంత శోకదుఃఖాది నానాపీడపరిహారంబై విరవధిక విత్యా
నంద సౌఖ్యంబు సమకూరెడినని సనకాదులెరింగించిన బ్రణయ ప్రకర్షణం
బున సురముని సత్తముండు. 148

చ. ఎవరి యమోఘదర్శన మనేక భవార్తులడంచి మేలు మా
నవులకు విచ్చునో; యెవర నారతశేషము భావిగీత భా
గవతకథా సుధారస సకౌతుకచిత్తులో యట్టివారినే
నవిరళ భక్తి ప్రేమము బయల్పడజేయగ వాశ్రయించెదన్. 149

ఉ. నైక జనుస్సహస్ర సముదంచిత భాగ్య మహా ఫలోదయో
త్సేకత సత్సమాగమము జేకుఱునప్పుడు పూరుషుండు బో
ధాకరహేతు మోహ మద దంభ ఘనాంధ తమంబడంచి, య
స్తోకవివేకమున్ బొడము తోడన పెంపొనరించుకోదగున్. 150

వ. అని దేవసంయమి కుమారసనకాదుల బ్రశంసించెనని సూతుండు శౌన
కాదుల కెఱింగించుటయు. 151

చ శివ కమలాసనాద్యమర సిద్ధమునిస్తుతిపాత్ర లోకబాం
ధవకుల దుగ్ధసాగర! సుధాకర తీర్థపదారవింద! వై
శ్రవణ మదాపశేంద్ర మృగరాజ! ఖరాంతక విర్జితేంద్ర! వై
భవనతపారిజాత! రఘువల్లభ! దాశరథీ! దయానిధీ! 152

కం. నీరేజ పత్రలోచన
పారామల సద్గుణ ప్రసవసౌరభ సం
పూరిత సకలాజాండా
ధారాధర నీలధామ! దశరథరామా! 153

మాలిని: నవన కుశలకారీ! సాధు లోకోపకారీ!
భువన భరణదక్షా! భూసుతేచ్ఛా ప్రతీకా!
దివిజ వికరసేవ్యా! ధీరవిత్యాను భావ్యా
శ్రవణ సుఖదనామా! చారు సాకేతధామా! 154

గద్య :- ఇది శ్రీరామచంద్ర కరుణాపరిలబ్ధ కవితా
విభ్రాజమాన భోజనపల్లికులపవిత్ర కౌండిన్యస
గోత్ర కృష్ణార్యతనూభవ వేంకటార్య విరచితం
బయిన శ్రీ భాగవత మాహాత్మ్యంబునందు 155

ప్రథమాశ్వాసము సంపూర్ణము

# శ్రీ మద్భాగవత మాహాత్మ్యము

## ద్వితీయాశ్వాసము

క. సవనావన భవపావన
శివపటు కోదండదళన! సీతారమణా!
భువనైక సుజన జీవన
ప్రవిమల సుగుణైక ధామ రాఘవరామా. 1

వ. దేవా! దివ్య చిత్తంబున నవధరించెదవుగాత! సకల పురాణాఖ్యాన విఖ్యాతుండైన సూతుండఖిల హరికథా శ్రవణ పరిణతాంతః కరణుండగు శౌనకున కిట్లని తెలుపందొడంగె

అట్లు దేవముని శేఖరుం డత్తపోధన పురందరుల బ్రస్తుతించి పదంపడి యవలోకించి. 2

మ. సదసద్ జ్ఞాన విరక్తి భక్తుల బ్రతిష్ఠంజేయు యత్నంబునన్
హృదయామోదకరార్థ గౌరవ వచో హృద్యంబు నానాకథా
స్పదమౌ శ్రీ శుకశాస్త్ర మెంచను ప్రశస్త జ్ఞాన యజ్ఞంబు బెం
పొదవన్ జేయుటకర్హమైన సదమేదో దాని భాషింపరే. 3

వ. అని ప్రార్థించిన 4

సీ. మధురార్థ శుకశాస్త్ర మహితాను భావంబు
గుదు రహస్యార్థముల్ గుదురు పడగ
వేద వేదాంగాది విదులైన సాధువుల్
విశదంబు కథన గావింప వలయు

శ్రీ శుకవ్యాహృత శ్రీ భాగవతకథా
శ్రవణ కొన్ని దినాలు సలుప వలయు
నియతిమై గావింప నియమంబు లెల్లను
విరచించ వలయును విధము దెలిపి

ప్రేమ గ్రహమున నవి వివరింపు డన్న
యనుచు బ్రార్థించ నాతని నాదరించి
సనకముఖ తపోధన చంద్రు లిట్లు
అనిరి యుచిత మృదూక్తుల నతనితోడ. 5

కం. స్నాతక జనపాతక సం
ఘాత ప్రక్షాళన చరణ గంగాతటినీ
శీతల వాతార్భక పరి
పూత ముఖ ద్వార నికట భూభాగమునన్. 6

సీ. శిష్య ప్రశిష్య సంశ్రితజన సేవిత
వరతపోధన పరివారితంబు
సాధ్య విద్యాధర చారణ గంధర్వ
దేవ సిద్ధ కదంబ సేవితంబు
దివ్య మేకాంత ప్రదేశస్థ మనుపమ
మామోద కరము సుఖాలయంబు
చామీకర సరోజ చంచరీక మరాళ
రుచిరాంబుపూర్ణ సరోవరంబు
పుష్పఫలలతా తరువన భూషితంబు
కోమల పులిన హృదయాభి రామతలము
అపగత విరోధిజంతు సమాకులంబు
దనరు నానందనామక తటవనంబు. 7

వ అచట. 8

చ. సలుపుము జ్ఞానయజ్ఞముల సర్వము నీకు సుసాధ్యమౌను తే
వల రసరూపమై వెలయు భాగవతార్థము పాగునందు వృ

ద్దల దనతోడ విర్వరను దొకొనివచ్చును భక్తి మాధవో
జ్జ్వల కథలొప్ప శాస్త్రలకు వత్తురు భక్తి ముఖాదు లిబ్బుచున్. 9

తే. హరికథాశబ్ద మిసుమంత నాలకించ
వారు ముఖ్వరు నవవయః పాటవంబు
మేన జేకూరి పొలతు రమేయ కాంతి
యురము సర్వాంగముల లక్ష్మి సత్వరమ్ము 10

తే. ఈ విధంబున దెల్పి సమిద్ధతేజు
లా కుమారులు సనకాదు లతవి గూడి
సత్కథా రసపాన తత్పరత వెలయ
తరలి గంగాతటంబును దరియ జనిరి 11

తే. భూర్భువర్లోక సురలోక ముఖ్యలోక
వాసులగు వైష్ణవో త్తముల్ వచ్చిరటకు
భాగవత కథా పీయూష పానమునకు
మూగి రసలంపటాత్ములై మొట్టమొదట 12

తే ఆధిక గౌరవమునజేపి యరుగలేవి
దేవ గంధర్వ కిన్నరాదిక వగాళి
భృగువు వెరవార బోదగావించి పనుప
వరిది తత్కథా రస శ్రవణాను రక్తి. 13

సీ. గౌతమ భృగుకణ్వ కశ్యప జమదగ్ని
గాధేయ గర్గశాకల వశిష్ఠ
జైమిని మాండవ్య జాబాల వరతంతు
దేవల కోహల దేవరాత
కౌత్స మార్కండేయ గాలవ శాండిల్య
పైల భరద్వాజ పరశురామ
మైత్రేయ రోమశ మౌద్గల్య పిప్పల
చ్యవనాత్రి వశ్వర యాజ్ఞ వల్క్య

పర్వత పరాశరాసిత వ్యాస సుబల
ఘటభవ ... చ్ఛాయా శుకాదులైన
యోగివర్యులు శిష్యాది యుక్తు లగుచు
వచ్చిరి కథాసుధా నిషేవణ మనీష 14

వ. మరియును, 15

సీ. చతురాగమోపనిషన్మంత్ర తంత్ర ష
ట్శాస్త్ర స్మృతి పురాణ సంచయములు
గంగా సరస్వతీ గౌతమీ ముఖనదీ
పుష్కరాది సరస్సమూహ ములను
వారణాసీ గయా బదరీ కురుక్షేత్ర
సేతు ముఖాఖిల క్షేత్ర ములను
ప్రాఙ్మఖాశాష్టక ప్రాతరాదిక కాల
మందరాద్య చల సమాజ ముఖను
దండకాది కారణ్య కదంబ కములు
దివ్య సుందరా కృతులూని తేజ మెసగ
భాగవత కథామృత రసాస్వాద నిరతి
విబుధ గంగాతటము జేర వేడ్కఁజనిరి. 16

కం. సుర విద్యాధర కిన్నర
గరుడోరగ సిద్ధ సాధ్య గంధర్వులు వ
చ్చిరి గంగాతటి జేరగ
హరిచరితామృత నిషేవణాసక్తి మెయిన్. 17

మ. శ్రవణాసక్తిని యేగుదెంచిన యమర్త్యశ్రేణి మున్నైన భా
గవత గ్రామణులన్ యథావిధి బహూకారాసన న్యాసనా
ర్ఘ్య విశేషంబుల బూజనల్పి గుశలప్రశ్నాను పూర్వంబుగా
దివిజర్షీంద్రుడు దీక్షితుండగుచు నాతిథ్య క్రియాలోలుడై. 18

సీ. పరమ హంసక పరివ్రాజకా చార్యులై
వైష్ణవాద్యులు బ్రహ్మవాదు లైన
సనకాదులన మించి స్వ స్వోచితాసన
సమున విష్ఠులయిరి సభికు లందు
నగ్రభాగంబున నధివసించిరి హరి
స్మరణ పరాయణుల్ సనక ముఖులు
వారి కభిముఖులై నారదు డొకయోర
నొకట దపోధను లొకట సురలు
నొకట వేదోపనిషదాదు లొకట నదులు
నొకట వనములు క్షేత్రంబు లొకట నొకట
సత్కథా కర్ణనాగత సకలజనులు
గా నిటువసించిరా సభాంగణమునందు. 19

వ. ఆ శుభసమయంబునందు. 20

చ. జయరవముల్ నమశ్కృతులు శంఖరవంబులు మిన్నుముట్టె పై
వయిచిరి సూన లాజ పటవాస కులాక్షతలన్ సురాంగనల్
ప్రియమున వారిమీద గురిపించిరి కల్పక పుష్పవర్షముల్
బయల విమానరాజముల పై జరియించుచు దేవనాయకుల్. 21

ఉ. యోగివరేణ్యు లాదిమును లుత్తములౌ సనకాదులట్లు శ్రీ
భాగవత ప్రభావ మనవద్య సమాహిత నిశ్చలైక చే
తోగరిమన్ వచించిరి మృదుస్ఫుట సవ్యతరోక్తులన్ మహా
భాగుడు సర్వభూతహిత భావయుతుండగు దేవమౌనికిన్. 22

ఉ. ఏయది విన్న మాత్రముననే యపవర్గము చేతిలోనిదౌ
నేయది యాలకింప జగదీశుడు వాసముజేయు నాత్మలో
నా యతిలోక భద్రకరమై రసపూరితమై యనన్య సా
ధ్యాయతనంబు నాగ నలరారెడు భాగవతాఖ్య సంహితన్. 23

వ. సవిస్తరంబుగా వక్కాణింతుము యయ్యా! సురపారి కాంక్షి వర్యా!
దత్తావధానుండవగు మయ్యది యష్టాదశ గ్రంథ పరిమితంబై ద్వాదశ

స్కంధ సంహితాత్మకంబై పరీక్షిచ్ఛుక సంవాద రూపంబై తేజరిల్లు, శ్రీ మన్మహాభాగవత పురాణ రాజంబఖిల లోకానుపద సంసేవ్యంబును, సముపాస్యంబును, సంభావ్యంబును, శ్రోతవ్యంబునునై యలరారు. 24

మ. అనఘంబై బుధసేవ్యమైన శుక శాస్త్రోంచత్కథా లాపముల్
జనుడెందాక వినండో! యంతవరకున్ సంసార చక్రంబునం
దనిశంబెంతయు సంభ్రమించుచు దురాశాకీర్ణ విక్లాంత చే
తనుడై సందురుచుండు నాపదలచేతన్ దుస్తరాజ్ఞానతన్. 25

చ. తడబడజేసి బుద్ధి పెడదారులు బట్టగఁ జేసినట్టి మీ
పెడగు పురాణశాస్త్రములు వేదములేమి ప్రయోజనంబు లో
గడుకొని మోక్షలక్ష్మి నిదె గైకొను మిచ్చెదనంచు బూని స
గ్గడనెలుగెత్తి చాటుచు జెలంగెడు భాగవతంబు గల్గగన్. 26

తే. వాజిమేధ సహస్రంబు వాజపేయి
శతము శుకశాస్త్ర షోడశాంశంబు బోల
వెప్పుడును భాగవత కథ లెసగునట్టి
గృహమఖిల తీర్థస్వరూపమై యెసక మెసగు. 27

మ. అరవిందోదర దివ్యనామ గుణలీలాంచత్కథో దాత్తమై
పరమ శ్రీకరమైన భాగవతమున్ భక్తిన్ సమస్తంబుగా
నరులెందాక వినంగనేరరో! యఘవ్రాతంబులెల్లన్ నిరం
తరమున్ వారల బాయవంతకు దపోధన్యా! మునిగ్రామణీ! 28

సీ. పుష్కర గంగాది పుణ్యతీర్థస్నాన
ఫలములు సమతను బడయలేవు
కాశీ ప్రయాగాదిక క్షేత్రదర్శన
ఫలములు సామ్యంబు బడయలేవు
హయమేధ రాజసూయాధ్వరాదిక మహో
ఫలములు తుల్యత బడయలేవు
జప తపోదాన దీక్షాముఖ్య సముపాత్త
ఫలములు సాటిని బడయలేవు

ప్రాజ్య వేదేతిహాస పురాణకథన
ఫలము లెన్నైన నిసుమంత బడయలేవు
హృద్య భాగవతకథా సమిద్ధ ఫలము
నందు నొక శతాంశముతోడ నైన నరుడు. 29

తే. పరమ పదవాంఛ నెమ్మది బరగువార
లొనర భాగవతశ్లోక మొక్కటైన
నర్థమైనను దగ బాదమైనగాని
భక్తి నిరతంబు పఠియింప వలయుఁజుమ్మ. 30

సీ. ప్రణవాక్షరమునకు భాగవతమునకు
వేదాంతమునకును వేదమునకు
ద్వాదశాత్మునకును, ద్వాదశాక్షరికిని
ద్వాదశికిన్ హరి, వాసరముకు
పురుషోత్తమునకును సురభికి దులసికి
అగ్నిదేవునకు ప్రయాగమునకు
నవపీసురునకు గాయత్రికిని వసంత
మునకు బురుషసూక్తమునకు వత్స
రాత్మకమగు కాలమ్మున కాత్మలందు
ప్రాజ్ఞు లెంతేని భేదభావంబులేక
వాసుదేవుని దివ్యరూపములుగాన
ప్రీతిచేతను భక్తి భావింతురంద్రు. 31

మ. అనిశమెవండు భాగవత మర్థముతోడ బఠించు నా మహా
త్మునకు జనుస్సహస్రకృత దోషచయుంబులు నాశమొంది పెం
పొనయగ రాజసూయమఖమున్ హయమేధ మఖంబుదారతన్
బొనరుచు పూర్వపుణ్యములు బొంది సుఖించును నిక్కవంబుగన్. 32

సీ. మహిమాంచితంబయి మంగళప్రదమయి
పొలుపొందు తులసికా పోషణంబు

సకలపాపహంబయి యత్యంత శుభదమై
చెలగెడు ధేను సంసేవనంబు
ప్రకటాగమాంచల ప్రతిపాద్య మానమౌ
భాగవత పురాణ పఠన నిరతి
సముపాస్యమానమై స్వస్వాను రూపమై
చెలువారు శ్రీహరి చింతనంబు
సరయ నొండొంటితో సాటియని వచింతు
సకల ధర్మానుశాసన సభలయందు
నిఖిల తాత్త్వికవిదులయి నెగడుమునులు
సకల లోకోపకారంబు సలుపుకొరకు. 33

కం. జీవోత్క్రమణము వేళన్
బావన శుకశాస్త్ర పుణ్య వాక్య స్ఫురణన్
గావించువాని కొనగున్
గోవిందుడు పరమపదము కూర్మిదలిర్పన్. 34

తే. స్వర్ణ సింహాన్వితముగ శ్రీభాగవతము
పాత్రుడగు భాగవతునకు భక్తి నొసగు
పరమధన్యుడు సాయుజ్య పదవిబొంది
కేవలా నందమునుజెందు కృష్ణుతోడ. 35

సీ. జననమాదిగనొక క్షణకాల మేనియు
బూనిక నేకచిత్తమున దనరి
యే భాగ్యహీనుండు శ్రీభాగవతకథా
మృతమానడో ! ఆ నికృష్ట తముడు
చండాలు విధము రాసభము విధంబున
వ్యర్థము వానిజీవనము వాని
పశునముండని మహి భారరూపుండని
సంతతామంగళ చరణుడనియు

జనని జన్మము దుఃఖ భాజనమొనర్చు
పాపకర్ముడు నీ వాని బ్రతుకదేల?
తలప జీవచ్ఛవంబని పలుకుచుందు
రంబురుహ సంభవేంద్రాదులైన మునులు. 36

తే. కోటిజన్మ సమార్జితాకుంఠ సుకృత
పరిణతింగాక శ్రీభాగవత పురాణ
మంజులకథా సుధాస్వాద మహిత సుఖము
నెనయు భాగ్యంబు మరి లభియింపగలదే. 37

చ. ఋుక్షమును బ్రహ్మచర్యము సమిద్ధ కులోచితవృత్తమొప్ప నూ
ర్జితమతి నిత్యమున్ గడగి శ్రీకర గోపకుమార సత్కథా
ద్భుత శుకగీత భాగవతమున్ ముదమారగ నాలకింపనా
యతతపోధురీణ! కమలాసనమానసపుత్ర నారదా! 38

తే. దివసనియమంబు పనిలేదు దీర్ఘభక్తి
నిశ్చలైక మనస్కుడై నియతితోడ
పూజ్య భాగవతమును సంపూర్ణముగను
సర్వకాల మాకర్ణింప జనుసుమ్మి. 39

మ. మనముంగెల్చి విధిప్రకారమగు నేమంబొప్ప దీక్షానుపా
లనమున్ జేయ నశక్యమైతగుకలిన్ లక్షించి శ్రీవ్యాసనం
దనుడౌ శ్రీ శుకదేవుడేర్పరచె నాస్థన్ లోకకల్యాణ భా
జనమైనట్టి విధానమొండు మును శ్రీ సప్తాహమున్ సత్కృతిన్. 40

మ నిరతన్ శ్రావణ మాఘమాసముల నిర్వాణాను సంధాన బం
ధుర మాహాత్మ్య విశుద్ధ భాగవతమున్ దోరంబు సద్భక్తిమై
గరమాలించిన యట్టి సత్ఫలము సాకల్యంబు నానాశుభో
త్కర సప్తాహ కథానక శ్రవణ మాత్రం జేకురున్ నారదా! 41

ఉ. మోహమదాదులేచి వలు శోకలు బోవు మనంబు నర్థపుం
దాహము రోగపుంజములు దాల్గొని యాయువు నాహరింప ను

త్సాహముడిందుచున్న కలిజాతుల మేలు మదిందలంచి స
ప్తాహ సమగ్ర సంశ్రవణ మారసిచేసె శుకుండు సత్కృపన్. 42

తే. తలప యోగ సమాధులు జపములెన్ని
సలిపిననుగాని యెంతేని గలుగనట్టి
సత్ఫలంబు సప్తాహ సంశ్రవణ వశత
నబ్బు దానికదియ నిరాయాసముగను. 43

సీ. పావన క్షేత్ర సంసేవనంబునకంటె
నఖిల తీర్థావగాహనముకంటె
శృతి పాఠములకంటె వ్రతరాజముల కంటె
సత్పురాణేతి హాసముల కంటె
రాజసూయము కంటె వాజపేయము కంటె
జపముకంటెను మహా తపముకంటె
దానంబు కంటెను ధ్యానయోగము కంటె
యమ నియమాది యోగముల కంటె

నధికతరమైన సప్తాహ మలరుమిగుల
నదిర! సప్తాహ మహిమమేమనగవచ్చు
పతిత కృపణాది ముక్తి సంపాదకంబు;
సకల సముపాస్య పరమార్థ సాధకంబు. 44

ఉ జ్ఞాన జపాది ధర్మములు గాదని యోగవిదాదిసూచకం
బౌ, నిరవద్య భాగవత మారయ కేవలముక్తిదాయకం
బౌనను వింతపల్కు లిపుడాదితి రేగతిగల్గె దాదృశా
నూన మహత్వగౌరవ మనోజ్ఞత దానికి సూత దెల్పవే. 45

వ ఆనివేదిన శౌనకునకు సూతుండిట్లని మదివె. 46

సీ. వసుమతీ తలమును వదలి దామోదరు
డేనాడు వైకుంఠ మేగదలచె
ఆనాడె యావార్త నాలించి యుద్ధవు
డచ్యుత విశ్లేష మాత్మదలచి

కాతరుడై కృష్ణు గడిసి విధేయత
నిటలాంచి తాంజలి పుటము వెలయ
భయద దుస్సహ ఘోర భావికాల జనిష్య
మాణాపదుద్విగ్న మానసమున

ప్రేమ భయభక్తి వినయ వివేక యుక్తు
డగుచు నభివాదనమొనర్చి యంతికమున
ప్రార్థన న్యాయ సాంత్వనాద్యఖిల గతుల
వెలయ విన్నపమిట్లు గావించె నతడు. 47

ఉ. నీవు ధరం దొరంగి నిజ నిత్యవిభూతిపదంబు జేరగా
బోవగ, మోదమాత్మ దగబొందెదుగాని యిటన్ సమస్తమున్
నీవని నమ్మియున్నమము నెట్టన నెవ్వగపాలద్రోచి నీ
వేవిధి బోవనెంచితివొ ! ఈశ ! యచింత్యములౌ భవద్విధుల్. 48

చ. అదె యరుదెంచు నీవరుగునంతన లోకభయంకరాతి దు
ర్మదకలి, దుర్విపాక ఖలమండల మొందుకొనంగలాదు, దు
ర్హృదయుల నంగతిన్ సుజను,లెల్ల దురాగ్రహచిత్తులై మహిన్
గొదగొన జూతురీపగిది ఘూర్ణిలనుమ్మి జగంబులన్నియున్. 49

తే. కలిని నానాట బెంపును గాంచు పాప
భరము మోవంగ జాలక పల్లటిల్లి
దీనయగు గోరూప భూదేవి యన్య
నింకమీద నెవ్వని యాశ్రయించు నాకొ్క. 50

తే. కరగి సమదృష్టితోన రక్షాపరత్వ
మరిప నీకంటె నితరుల కలవిగాదు
గాన సుజనులయెడ నీవు కనికరించి
భక్తవత్సల వదలిపోవలదు మమ్ము. 51

చ. శ్రితజన రక్షణార్థమయి చిన్మయనిర్గుణమూర్తి నుండు నీ
వతుల విభూతి రాజిలగ నాకృతినొంది మెలంగినట్టి య

చ్యుత! వసుదేవనందన! భవోదధితారక దివ్యనామ! మా
స్థితిగతులెంచి మామనవి జేకొనవే కృపకైకవత్సలా! 52

శా. రాజీవేక్షణ! నీకు భక్తజన సంరక్షాపరత్వంబదే
యోజందప్పదు గాన నీదగు ప్రయాణోద్యోగమున్మాని ని
ర్వ్యాజానూన దయాసుధారస పరీవాహంబు పూరించి యు
ద్వేజత్కాలకఠోర తీవ్ర దురితక్ష్వేడాగ్ని జల్లార్పవే. 53

ఉ. దానశరణ్య! నీ విరహ దారుణవహ్నికి గ్రమ్మగ్గకిమ్మహిన్
వాసమొనర్చి నిల్తురె భక్తులు కష్టమేత నిర్గుణో
పాసనదుష్కరంబు దురవాపముగాన మదిన్ విచారమున్
జేసిన తావనార్థమయి జేయుముపాయమనుగ్రహంబునన్. 54

కం. అను సద్ధవు పలుకులువిని
వనజోదరుడాప్రబాన వరతీర్థమునన్
మనమున మిగుల విచారం
బొనరించి యుపాయమరయ నుద్యోగించెన్. 55

కం. భక్తావలంబ మునకున్
యుక్తోపాయంబు విటుల నొనరుతువని సం
సక్తముగావించెను హరి
ప్రాక్తవ నిజతేజమెల్ల భాగవతమునన్. 56

మ. హరి యంతర్థివహించి భాగవత దుగ్ధాంబోధిలోనన్ విరం
తర సంపూర్ణ విశిష్ట మంజుల రసోదాత్తోల్లసద్రూప, వి
స్ఫురణంబొప్ప ప్రవిష్టుడౌట సవిదంపూర్వైక సంద్భశ్యమే
మురజిన్వాఙ్మయమూర్తి భాగవతమై బొల్చున్ జగద్గేయమై. 57

తే. బహుళ దారిద్ర్య దుఃఖ దౌర్భాగ్య ముఖ్య
వృజన నిర్మూలనంబు, గావించు కొఱకు
కామముఖ వైరి షట్క విషాదమునకు
నరయ గలిలోన ధర్మమియ్యదియ సుమ్ము. 58

వ. కావున పురుషులెంతటి విజ్ఞానసంపన్నులే యగుదురుగాక! తాదృశంబైన దైవమాయ దరించ నేరరని కాదె? శుకుండు సప్తాహంబును కేవల ధర్మంబుగా కలియుగంబున నియమించెనని, సూతముని పురందరుండు, శౌనకాదితాపస పుంగవులకు జెప్పి మఱల నిట్లనియె. 59

తే. కడగి సనకాదులిట్లు ప్రకాశపరచు
చున్న సప్తాహ సంశ్రవణానుధర్మ
మా సదస్యుల కవగాహమయ్యె, కాని
యట్టితఱి దోచె నట నొకయద్భుతంబు. 60

వ. అది యెట్లంటేని వివరించెద సవహితుండవై వినుము. 61

చ. తరుణ వయస్కులై తగు సుతద్వయితో నొడసూపె భక్తి మం
దరధర! నందగోపసుత! తామరసాక్ష! ముకుంద! శౌరి! శ్రీ
హరి! యను కృష్ణనామములు పారెకు పారెకనేకమైన వై
ఖరుల నుతించుచున్ బ్రణయ గౌరవమొప్ప సభాంతరంబునన్. 62

ఉ. భాగవతార్థభూష! నిరుపాధిక మంగళవేష! సంతత
త్యాగమనీష! యోచనలరారెడు భక్తినిగాంచి రమ్మహా
భాగ తపస్విలోక పరివారితమీసభ యెట్టులెప్పుడిం
దేగతిజేరె భక్తియని యెంతయు సభ్యులు సంశయాత్ములై. 63

చ. అనుపమ మాధురీయుతకథా ప్రతిపాదితమయ్యె భక్తి నీ
తనయులతోడ నిందిపుడుదార హరిప్రణత ప్రసన్నయై
యని మునులాకుమారసనకాదులు సభ్యులతో వచింపగా
విని, వినయావనమ్రయయి వేడె సనందన భక్తివారలన్ 64

ఉ ఓ సనకాదులార! పెనుపొందిన మీ యనుకంపజేసి, వి
ర్వాపితమయ్యె దుష్కలియు ప్రాజ్య ముకుందకథా రసంబునన్
శ్రీచెలువార వేడుకలచే నలువొందితి నెందునుండు నా
వాసము వావతిండు నిరుపాధికమైనదొకండు నాకికన్. 65

వ. అని తము వేడు భక్తిగని యా సనకాదులు నీవు ప్రేమ భా
వివశయి విష్ణురూపమున జెన్నుదలర్చి భవోగ్రరోగభం
జనమొనరించుచున్ బరమసాధులు వైష్ణవులైనవారి పా
వన హృదయంబులందెపుడు వాసమొనర్పు మవాప్తకామవై 66

ఉ. ఈ కలిదోషజాలము లవెంత సమర్థములైనవైన నా
లోకన జేయనైన బయిలోడునుగాన వసింపుమందె, ని
ర్భీకత నంచు వారు వివరించిన యంతన భక్తి కౌతుకో
త్సేకత డెంకిజేసె హరిసేవక పావన మందిరంబులన్. 67

మ. ధన పాండిత్య కులీనతాదులు కొలంతం జెందినన్ జెందె, నె
వ్వనిచిత్తంబు ముకుందభక్తికిరవో? వాడన్నిటన్ ధన్యుడౌ
టను దన్మానసమందుజేయును వికుంఠస్థానమున్ వీడి పా
వనభక్తి ప్రణయైకలోలుడయి శ్రీవాసుండు సంవాసమున్. 68

మ. పరమోత్కృష్టతమంబు పాపహరమై బ్రహ్మాత్మకంబౌ శుభా
కరమీ భాగవతంబు విట్టిదని యింకన్ జెప్పగానేల నో
సురమౌనీ! తదుపాసనా వశమునన్ శ్రోతల్ ప్రవక్తల్ దగన్
హరిసాయుజ్యము గాంచుచో నితర ధర్మావశ్య మింకేటికిన్. 69

ఉ. వైష్ణవలోక చిత్త నిరవద్య తరా ప్రతిమానభక్తి వ
ర్ధిష్ణు భవిష్ణు భక్తి నటు ప్రేమమయింగని శ్రీవికుంఠ వ
ర్తిష్ణుత మాని, కృష్ణుడొనరించె ప్రియంబున గాపురంబు రో
చిష్ణు జనాష్ణ భక్తజన చిత్తములందతి కౌతుకంబునన్. 70

సీ. భక్తవత్సలుడు శ్రీవత్సాంకు డుల్లస
న్మణి కర్ణకుండల మండితుండు
వనమాలి లలిత త్రిభంగి విలాసు డ
గణ్య మనోజ్ఞ లావణ్య యుతుడు
సజలపయోధర శ్యామలాంగుడు పీత
వాసుడు చందన వాసితుండు

కౌస్తుభోపేతుడు కాంచీముఖానేక
దివ్యాభరణ సముద్దీపితుండు
మావితానంద చిన్మూర్తి మధురవేణు
హృద్య గానాభిరతుడు శ్రీకృష్ణుడట్లు
భక్తి నిత్యానుషక్తుడై భక్తజనుల
చిత్తములయందు వాసంబు జేయదొడగె. 71

చ. భవపరిహారి హృద్యరస భాసురి భాగవతామహాకథా
శ్రవణ కుతూహలం బెడద సందడిసేయ వికుంఠ వాసు లు
ద్ధవముఖులైన వైష్ణవులు ధన్యులు సత్వరమేగుదెంచి యు
త్సవమున గూఢరూపములు దాలిచియుండి రనన్యచిత్తులై. 72

వ. అనిదం పూర్వ ప్రవర్తమానంబై యతిలోక దివ్యమహోత్సవ పరంపరా
స భావితంబై యసాధారణ మహిమాభిరామంబై యనన్య సిద్ధ
లౌకిక సుఖానందపరంబై, యలరారుచు, సప్తాహసర ప్రవర్తితంబై
యొప్పెడునట్టి. 73

సీ. సప్తాహ మహమట్లు సర్వతో ముఖముగ
సంపూర్ణతనుగాంచు సమయమందు
జయ జయారవములు బయలనిండె కరంబు
విరిసె నలౌకికోద్వేల రసము
సారెసారెకు మ్రోసె శంఖారవంబులు
కురిసె సచూర్ణమై విరులవాన
తనగేహవిస్మృతి గనిరి సదస్యులు
కేవల పార లౌకిక సుఖంబు

పీ స్థిరచరాత్మక మయిన సృష్టికిట్లు
లోకకటన తన్మయావస్థ యొదవ గాంచి
విస్మయంబంది సురమౌని వేడెనిట్లు
సనక ముఖ తపోధన సత్తములను. 74

సీ. సర్వాతిశాయి యీ సప్తాహ మహిమ మ
లౌకిక మధిక ఫల ప్రదంబు
విరతిశయోజ్వల నిర్వాణదాయక
మఖిలైన వంసేవ్య మగుటజేసి
యానందనామ విఖాత తపంబెంత
దవ్యతమంబుగాదా తలంప
విటజరించెడు ఖగ మృగ పన్నగాదులు
శఠ మూఢ కితవాద్య సాధు తతుల
నపహతాఘంబులై సుఖమందుగాన
పృథివిలో భవాపహమై పవిత్రమగుచు
చిత్త మాలిన్య సంశుద్ధి సేయ కలిని
యీ కథ సమాన మొండిక నేడిలేదు. 75

ఉ. శ్రీహరి నామరూపగుణ శీల కథామయమై తనర్చు స
ప్తాహమఖంబు లోకహితమారసి సత్కరుణాంతరంగు ల
వ్యాహత మార్గమొండిటు బయల్పడజేసిరి యట్టిదాన దు
ర్మోహమడంగి యెట్టిరు ప్రభూత శుచిత్వము గాంత్రు తెల్పరే? 76

వ. అని పరమభక్తి పాంద్రుండగు సురముని చంద్రుండు విచారించుటయు, పరతత్వ జ్ఞాన విస్తంద్రులైన కుమార సనకాది యోగీంద్రులు సప్తాహ నైసర్గిక మాహాత్మ్యం బిట్టిదని తెలుపసమకట్టిరి. 77

సీ. హింస కులాచార హీనులు క్రూరులు
క్రోధాగ్ని దగ్ధులు కుటిలమతులు
పంచోగ్ర పాతకుల్ వంచన శీలురు
బ్రహ్మ స్వపుష్టులు పాపరతులు
మదమత్తచిత్తులు మత్సరగ్రస్తులు
కృపణులు కితవు లకీర్తిపరులు
దుష్టులు పితృమాతృ దూషకుల్ దాంభికు
లాశ్రమ ధర్మఘ్ను లనృతపరులు

మనసుచే వాక్కుచేతను తనువుచేత
నిత్య మఘము లెన్నియో చేయు నీచులైన
ధన్యసప్తాహ యజ్ఞానుభావ మునను
పూతులై ముక్తులగుదురో మునివరేణ్య! 78

వ. ఇందు సకలపాప పరిహారకంబును, నిరవద్య నిత్యసుఖ ప్రతిపాదకంబును నగు పురాణేతిహాసంబొండు గలదు. దానిని వక్కాణింతు మాకర్ణింపుము 79

సీ. కలికల్మషాపహ కల్యాణకల్లోల
తుంగభద్రానదీ తోయసిక్త
పావన తటమున బహు సంపదలు గల్గి
పుష్ప ఫలోద్యాన ములను వెలసి
సుఖము లతిరయి శోభిల్లి నిజధర్మ
నిరత చాతుర్వర్ణ్య నిబిడ మగుచు
గ్రామపురమున నమర భాస్కరుని పగిది
వేద వేదాంగ సంవేది విత్తశాలి
భిక్షుకుండు శ్రౌతస్మార్త దక్షుడగుచు
నివసించు, నాత్మదేవు డంచనగ నొకడు. 80

చ. ఆతనికి ధర్మపత్ని కలహప్రియ సుందరి సత్కులీన గ
ర్వీత బహుజల్ప, స్వీయగృహకృత్య సమర్థ వరప్రవృత్తి సం
శ్రితిరత, యన్యవంచన. వచోరచనాతి విదగ్ధ, ధూర్త, సం
తతనిజ వాగ్దీకరణ తత్పర, దుంధులి నా దనర్చెడున్. 81

వ. ఇట్లయ్యు నయ్యేలనాగ నిజభర్తృ సమక్షంబున. 82

చ. వినయ వినీతబం బ్రణయ భీతులు దోప విసర్గ దుర్గుణం
బనువుగ లోనడంచి దిటమారగ దుంధులి నిత్యమాత్మదే
వుని దనయాత్మ దేవుడను బుద్ధి భజింపగ సంతసిల్లి య
య్యనఘుడు పత్నితోగనె సుఖైక మనీష నిహోపభోగమున్. 83

వ. అట్లయ్యు నతండు, సంతానచింతా దంతురిత స్వాంతుండై. 84

ఉ. అంచిత రూప యౌవ్వన సమన్విత యౌ కులకాంతతోడ దా
గాంచిన నవ్యభోగములు కామము లర్థము లెన్ని యైన నొ
క్కించుక వింపుగామి రచియించెను గో ధరణీ హిరణ్య, గే
హాంచిత భూషణాంబరము లర్థులకిచ్చుచు పెక్కు ధర్మముల్ 85

చ అవిరళము ధర్మమాత్రమున కాతని చిత్తము లోన నర్థమున్
బలియె నదైననేమి తను జాతునినైన తనూజునైననున్
గనమికి జింతనొంది యొకనాడతడేగె మహోగ్ర దుర్గ కా
ననమున కిల్లువాకిలి మనంబున రోసి విషాదతప్తుడై. 86

వ. ఇట్లక్కాంచన గర్భాన్వయ పయోరాశి సుధాంశుండైన యాత్మదేవుండు; సంతాన చింతా వితాంతఖిద్యమాన మానసుండై, నానా తరువల్లీ కుడుంగాది సంబాధంబై, బహుళ వన్య సత్వసమాకులంబై, క్రూర వికటాకార, ఖరఖరానన ధర వనేచర శబర పరివారితంబై, భీకర దర్వీకరనికర సంవేల్లిత కరాళశాఖా భయదశాఖి సమభివ్యాప్తంబై, మహోత్తుంగ శిఖర శిరః పాతుక నిర్ఝరఝరీ ఝూళ ఝుళీరవ ముఖరిత భువ నభోంతరాళంబై యొప్పు దుర్గమారణ్యంబున; సమ విషమ నిమ్నోన్నతంబైన మార్గంబున, మిట్ట మధ్యాహ్నంబై, యతిక్రమించుచున్నతఱిం బడలి మిగుల దప్పి నలమూలలరయుచు జనుచుండ, దైవవశంబునం జేరువ విమల మధురోదక పూర్ణంబైన యొక్క తటాకంబు గని, యూరడిల్లి యటకుంజని, తత్తటాకంబున జలంబులాడి, సంధ్యావందనాది విహిత క్రియాకలాపంబుల నిర్వర్తించి, శీతల మధురోదకంబులం గ్రోలి, యచ్చేరువన స్నిగ్ధచ్ఛాయా విలసితంబైన యొక్క తరుమూలంబున నధివసించి యున్నంత, కొంత వడికి. 87

మ. ఒకడత్యంత జగద్ధితాచరణ నిత్యోద్యోగి సందీప్త పా
వక సంకాశుడఖండ దుష్కర తపోభ్యాసుండు దాంతాఖిలై
హిక సర్వస్వు డదృష్టపూర్వుడగు యోగీంద్రుండు సుశ్లోకు డ
త్యకలంక స్వపురాణ పుణ్యఫలమై యచ్చోటి కేతెంచినన్. 88

మ. కని యా సౌమ్యుని దివ్యతేజమునకున్ కౌతూహలంబంది యా
యనఘుండంత తటాకనీరముల డాయంబోయి పీరాని చెం
తన నొండొక్కట గూరుచున్న నటకీ ధాత్రీ సురుండేగి వం
దనమున్‌జేసి కరంబులన్ మొగిచి వంతన్ జెందచున్ నిల్చినన్, 89

వ. కని తపోధనసత్తముం డతనితో నిట్లనియె. 90

కం. బలితపు జింతకులోనై
విలపించెదవేలనోయి విప్రా! నీకున్
గల చింతాకారణమున్
దెలుపుము కలరూపునాకు తెల్లముగాగన్. 91

కం అని కరుణం జల్లని చూ
పెనయగ వీక్షించి పలుకు ఋషివర్యునితో
తన దుఃఖ హేతువిట్లని
వినిపించె నతండు స్వీయవృత్తము దెలియన్. 92

సీ. తెలుపంగ నింకేమిగలదు పూర్వార్జిత
పాపౌఘ పరిపాక వశతజేసి
మా పెద్దలీనాడు మందోష్ణ జలములే
విషమ పోల్కి ననుభవింతు రకట!
నా యిడ్డపిండముల్ డాయరు ప్రియమున
దైవికంబుగ విధి దప్పిగాక
నా చేయు కర్మముల్ పీచ తమంబులై
యరుగును వింకొక్క తెరువులేక
వనికి వచ్చితి జీవముల్ వాయుకొఱకు
జీవనంబేల? గృహమేల? సిరులికేల?
చదువులేల? స్నానములేల? సంధ్యలేల?
కులములేల? సంతాన హీనులకు జగతి. 93

సీ. వెలఁది నాటిన వృక్ష వితతు లింతకునైన
ఫలశూన్యమై గొడ్డువారు చుండు
నే వేర్కుమంచిన, గోవు సైతము కట్టు
నైననుంగనక వంధ్యాత్వ మూను
నేవేళలందైన నేదెచ్చి మాయింట
విడునంత ఫలచయం బెండువారు
ప్రేమచే నే బెంచు వృషదంశకంబైన
కూనలఁబెట్టక గొడ్డువోవు

ఇట్టి సంతాన సౌభాగ్య హీనతముఁడు
నైన నాకింక నీజీవి తాశ యేల ?
చాల వలదంచు కన్నీరు జాలుగొనెడు 94
నట్లు వాపోయె బ్రాహ్మణుఁడతని మ్రోల.

వ. ఇట్లు క్షణక్షణ ప్రవర్ధమాన శోకాతిరేక వ్యాకులాత్ముండై, యాత్మదేవుండు
వాయెత్తి పెద్దపెట్టున నేడ్చుచున్నంత, హృదయందవిసి కరుణారసంబు,
నయనారవిందంబుల వెల్లివిరిసె నాయన చల్లని చూపులనతనింగటాక్షించి, 95
సాదరాతిశయంబున నతనితో యోగీంద్రుండిట్లనియె.

సీ. సంతాన మోహంబు సడలింపు మీ చింత
పీ పురాకర్మంబు విష్ఠురంబు
గాన వివేకంబు గైకొని సంసార
పాశమింతట ద్రెంచి పారవైచి
సుఖతర సన్న్యాస సురుచిర సౌభాగ్య
మనుభవించి ముక్తిగనుట మేలు
సప్త జన్మంబులు జనుదాక కొమరుల
గనెద వనెడుమాట కల్ల సుమ్ము

జ్ఞానదృష్టి భవద్భావి చరితమెల్ల
గంటి కొడుకుల గనియు సౌఖ్యంబు గనవు
సుతుల కతమున శోకంబు గనరె తొల్లి 96
సగర నరపాలు డంగరాజన్య వరుడు.

ఉ. నావుడు విన్నబాటు వదనంబున దోపగ బల్కె నాతడో
దేవ! వివేకమొల్ల ! సముదీర్ణ విరాగమునొల్ల ! లోక సం
భావితు నాత్మ జాతుని, గృపామతి నిమ్మటు లేకదక్కుచో
నీవ కనుంగొనంగ త్యజియింతును ప్రాణము లీక్షణంబునన్. 97

కం. సంతానాదిక సుఖముల
స్వాంతములో నెరుగనట్టి సన్న్యాసత్వం
బెంతయు శుష్కంబయి య
త్యంతాభావే విరక్తి యనునట్టులగున్. 98

తే. పుత్రపౌత్రాది సుఖపరి పూర్ణుడగుచు
దనరు గృహమేధి సరసుడు ధన్యచరితు
డట్టి మహనీయ సౌభాగ్య మందలేని
ఈ నికృష్ట జీవిత మింకేటి కనుచు. 99

వ. సద్యోమరణ వ్యవసాయ పరుండైన యాత్మదేవునివారించి, యయ్యో
గీంద్రుం డతనితో మరియు నిట్లనియె. 100

సీ. విధివ్రాత దప్పించి విపదబ్ధిమునుగడే
చిత్రకేతు నృపాల శేఖరుండు
దైవోపహత సముద్యముడ నీవెటులైన
సుతుల గాంచిన యేమి సుఖముగనవు
హఠమును వీడవే వర్ధిని నీకేమి
యాంత కెక్కుడు పచియింతు ననఘ
యని వాని యాగ్రహ వ్యగ్రత యన్య
పథమికెద్దియు నగపడమి జేసి
యా తపస్వి యనాగత మాత్మనెరిగి
దీని నీభార్య భుజియించు నేని నీకు
కుల సముద్దీపకుండగు కొమరు డొదవ
గలడటంచని యొకదివ్య ఫలమొసంగి. 101

వ. ఓయీ ! నీవిట్లు పట్టినపట్టు వీడకున్న వాడవగుటంజేసి, విధి విధానంబున కన్యధాత్వంబు గావింపవలసి వచ్చుట కతన, నిప్ఫలంబొసంగితి ఇది నీపత్నిభుజియించి యొక సంవత్సర పర్యంతంబు సత్య శౌచాది నియమంబుల బాటించునేని నీ యిష్టార్థంబు సిద్ధించునని పలికి యత్తపోధన వరేణ్యుండు యధేచ్ఛంజనియె, నంత విప్రుండు నిజమందిరంబునకు బరమ వ్యామోహంబున నరుగుదెంచి, నిజపత్నింగని, యద్దివ్యఫలం బొసంగి, దన్మహిమంబును, దన్నియమాచరణా వశ్యకతయు సవిస్తరంబుగా వచియించి, కొంతవడికి కార్యాంతరాసక్తుండై యెటకేనిం జనియె, అంత దుంధులి యొక యనుంగు నెచ్చలిం బిలిచి దానితో నిట్లనియె. 102

తే. కుడిచి కూర్చుండి నాతోడ గూడిమాడి
యొడలు మరపించు భోగముల్ వదయలేక
కొడుకులు కొడుకు లోయని గుందిగుంది
నట్టనడురేయి జనెనొక్క నాదకండు. 103

వ. అట్లు పోయిన పోక నిక్కంబని నమ్మి నింతటితో నాయెడ, వాపె నిక నింతియ చాలునని నిట్టింతగ కాలంబు గడుపుచుండ, నేడెవటినుండి యోవచ్చి నాపాపంబు బండినట్లు ఫలంబొండు దెచ్చి నా చేతనిడి నీవీ ఫలంబు భుజింపుము. దీని ప్రభావంబున మనకు సత్పుత్రుండుదయించునని ఏవియో కొన్ని నియమంబు లుపదేశించి కొంతవడికి కార్యాంతరంబున నెయ్యెడకో జనియె, వంతట నేనేమి దోచక నిన్ను బిలిపించితి. నింతటి దాననయ్యు నే నతని మ్రోల నేమాటాడుటకుం బయిలోడి ఈయాపద కులోనై చింతిల్లుచున్నదాన నీ దురంతర విపత్తు బాయుటెట్లు ఇకమీద దెరువెయ్యది ? నే నీ ఫలంబు భుజియింపనోప నది యేమిటికంటేని 104

సీ. ఫలభక్షణంబున గర్భంబు నిలుచును
గర్భంబు నిలిచిన కడుపుబెరుగు
కడుపు బెరిగినంత కుడుపు వాచవిగాదు
కుడుపుతగ్గిన బలముడిగి పోవు

బలముడిగిన విందు పనిసాగ దదిగాక
సుకుమారి నగునాకు ప్రసవబాధ
నోర్వంగ దరమౌనె యొక వేళ శిశువడ్డ
మరుదేర మరణంబె శరణమగును

అటులగాక మంచాన నే నలసిపడిన
గలుగునది యెల్లజేసట్ల గలదు వదినె
నత్య మాచారములు నాకు సాధ్యపడునె
వింతకును మూలమగుపందు నెట్లుదిందు. 105

కం. పనిపడి యావలి వాడకు
జనరాదు పలాయనంబు వశపడదేలా
గునజూచిన గిడవి తో
చనుపో : జాలాలితనము జోలియదేలా. 106

కం. సుతలాలన పాలనముల
జతవం బతిదుఃఖకరము స్వైరవిహారా
ప్రతిరోధకరము క్షితినే
మతిమాలిన వారొగాక ! మన్నింతురచే ! 107

కం. గొడ్డైన విధవయైనను
బిడ్డలు గననట్టి వెలది వివిధసుఖములే
జిడ్డెరుగక కాంచును దన
కడ్డము లేకుండ దోచునది యదిజేయున్. 108

సీ. అంతంత పములైన నవలీల దృటిలోన
దీర్చజాల్దిటమెల్ల దీరకున్నె ?
ఇంట నేపనికైన వంట వార్పులకైన
జంటగోరక యొంటి సల్పనగునె ?
గరగరలాడుచు కనువిందు గొలిపెడు
తలిరు సోయగమెల్ల బాయకున్నె ?

యీ జిగి యీ బిగి యీ మంపు విడుసొంపు
సర్వాంగ ములకు దొరంగకున్నె
ఇంతవర కొక్క గతి జరియించుచున్న
కొదమ ప్రాయంపు రసికుల కొలువులోన
నుదుటు గరువంపు తన ముడివోవకున్నె
సుతులకాశించి యిది భుజియించితేని. 109

వ. అని యిట్లప్పరమ మూర్ఖురాలు దౌర్భాగ్య విశేషంబున గుతర్కంబు గావించి. యిహపరంబుల ననమాన సౌభాగ్య సంపద లొసంగంజాలు నప్పలోత్తమంబు భుజింపక నొక రహస్య ప్రదేశంబున గుప్తపరచి యున్నంత. 110

తే. ఆత్మదేవు డిల్లాలి మృషాతివాద
కఠినమానస! దుంధులి గాంచి పలికె
ఫలము భక్షించితివిగాదె బహుజనుస్ప
మార్జితాగణ్య తరపుణ్య ఫలముకతన్. 111

వ. అనవుడు నబ్బోంకులాడి. 112

సీ. మంగళస్నానయై మణిమయా భరణముల్
వలిపంపు పట్టుపుట్టములు దాల్చి
విఘ్నేశు పూజించి పితృదేవతలగొల్చి
యిలవేల్పు భక్తిరాజిల భజించి
కుల గురూత్తమున కంజలిఘట్టి జేపట్టి
ఫలదాత నాత్మలో దలచి మ్రొక్కి
భవదీయ పావన పాదాంబురుహములు
హృదయ పీఠంబున నిడి నమించి
దీప ధూప నివేద నాదికసమర్చ
వలిపి విశ్చలై కతర ప్రసన్నమతిని
వంశదీపకుడగు తనూభవుని నొకని
ఫలవరేణ్యమ మాకిమ్ము పరమకరుణ. 113

వ. అని పరమనిష్ఠ నప్ఫలంబు భక్షించితి నదిమొదలు దినదినంబాత్మ కత్యంత వికాసంబొదవు చున్నదని యాదబ్బర మరియు నతనితో దనయుచిత సుగుణ విశేషంబు లెరుంగునదియపోలె నిట్లనియె. 114

చ. ఫలము భుజింపవో యనెడు భావము దోచెనె యెంతవెఱ్ఱి వా
రలయిననున్ భుజింపక దొఱంగుదురే యది యెంతమాట సూ
నుల బడయంగ నేరక వనోవ్యధ నొందిన మాట బైకినే
బలుకని యంత్రమాత్ర సుతవాంఛయె లేదని యెంచినారలే॥ 115

వ. అని శుద్ధార్జవ శీలుండయిన నాత్మదేవునకు దాను సుచ్రవత, నత్యనిరత, నిగూఢ, గభీరభావ యని దోపంజేయ కొన్ని కల్ల బొల్లు చల్లని మాటలాడి నంతుష్టాంతరంగుం గావించి కొండొక సమయంబున భర్తయింటలేనితరి యదృచ్ఛాగత యగు నిజభగినితో దనకుంగల చింతాకారణంబెల్ల నుడివి. 116

ఉ. ఈ వెతపేర్మి నేనయితి నిల్లెటుదోచదు నాకు నింకనే
ద్రోవ యటంచువేడ, నిని దుంధులితో నిసుమంత దానికే
పీవిటు భీతినందవెలెనే॥ విడుమింతట చింత సోదరీ
యీవెత తీరుదారి వచియింతు నొనక్ప్రముదావి నేర్పునన్. 1.7

వ. అని యూరడంబలికి, దనమనంబున నియ్యెడకు మంచి నమయంబుననే యరుదెంచితివి గావున, నాయత్నంబు సిద్ధించినదిగా దలంతునని సంతసిల్లి నప్రణయంబునం బోలె చెలియలిం గవుంగలించి మోముమోమునంజేర్చి సాకూతంబుగా దిలకించి. 118

కం. చూలొదవి యున్న దానను
వాలాయ మ్మిత్తునేను బాలని నీకా
కాలంబుదాక నీవుం
జూలొదవిన చొప్పు పతికి జూపట్టునటుల్. 119

వ. ప్రవాదంబుప్పతిలజేసి గుప్తంబుగ గృహంబున సుఖంబుగ వసింపు నీరహస్య భేదనంబు గాకుండవలయు జుమ్మీ। నా ప్రసవానంతరంబున

గొంతవిత్తంబు నా పతికనుపు మటులైన, యబ్బాలుని తక్షణంబున దెచ్చి యీగలందు నీతంత్రంబు బయల్పడకుండ యేను నానందనుండు మృతుండయ్యె ననెడు ప్రవాద మొదవింతు. అట్లయిన మన పథకంబు నిరంతరాయంబుగా పరిసమాప్తింగాంచు. ఇక నెద్దియేని మిషవన్ని నేననుదినంబును మీ యింటికరుదెంచి స్తన్యంబిచ్చి పోగలను. నీ వీఫలంబు గావున కొసంగు మటులైన దీని ప్రభావం బెఱుంగవచ్చునని చెప్పిన స్త్రీ సామాన్య సహజచాపల్యంబునం జేసి దుంధులి యద్దివ్య ఫలోత్తమంబు తన ధేనువునకుం భక్షింపనిడి, నటమీద తనతోబుట్టువును గృహంబున కనిచి నాటినుండి క్రమక్రమంబున దానును జాలోదరివిన యనియవోలె మెఱకువ గలిగి ప్రవర్తింపుచుండ, కొంతకాలంబు గడచిన మీద నొకనాటియందు 120

కం. తన భగిని తనయు గనెనని
విని యడిచిన విత్తమంది వేజనకును నం
దనుదెచ్చి తనకొసగునం
తన పతికెరిగించె గంటి తనయు నటంచున్. 121

వ. ఇది యెంతయు రహస్యంబగుట నీకుతంత్రంబు సన్నిహిత సంబంధంబు గలవారికి తక్కొరుల కెరుకపడదయ్యె. అంత నాత్మదేవునకు పుత్రోదయంబైన నవ్వార్తయుల కామోదంబయ్యె నతనిమందిరద్వార ప్రదేశంబున మంగళ వాద్యత్రయంబు లెసంగె, నానావిధ శోభనంబుల కమ్మహీసురాలయంబు దావలంబయ్యె. నతండు పాత్రులగు ద్విజులకు వివిధ మహాదానంబులిచ్చి, దీనాంధ కృపణాది ప్రకృతిజనంబుల కన్నవస్త్రాది దానంబులాచరించి, పదంపడి బాలునకు జాతకర్మాది బ్రాహ్మణోచిత క్రియాకలాపంబు లొనరించి, దుంధుకారి యని నామకరణం బొనర్చి, విస్తృత సంతోష భరితుండై, బహూత్సవంబుల సలుపుచు ప్రమోదమానసుండై యున్నయెడ నతని పజ్జకరుదెంచి సానుతాపంబు సానుకంపంబు, సానురాగంబుల నతని బరవశుం జేసి మధురంబుగా, నిపుణంబుగా దుంధులి భర్తకిట్లనియె. 122

ఉ. చన్నులపాల లేవెటుల సాకుదు నీవసిగందు దాది పా
లన్న లభింప వన్ని సమయంబులయందు మదగ్ర జాతకున్
మొన్న తనూభవుండొదవి పోయెను గావున బిల్వబంచినన్
గ్రన్నన వచ్చి పాలొసగుగాదె ప్రియంబున కన్నతల్లియై. 123

వ. అనిన యాత్మదేవుం డనుంగు పత్నిమాటకంగీకరించి తోడన యామెను రాబనిచి అమ్మా కొంతకాలంబు మాయింటనుండి యీ కుమారునకు స్తన్యంబొసంగి రక్షింపుము. వీడు నీకు కొమరుండే యగుంగాదె నీ సోదరి యనుభవ రహిత శిశు పోషణ విధి నెరుంగదు. సర్వంబును నీ యధీనంబయని శిశువును వదినెచేబెట్టి యాతం డూరటం గాంచె అంతట మూడు నెలలు నిండిన మీద నాత్మదేవుని గృహంబునం దొకనాటి సుముహూర్త కాలంబున. 124

మ. కనియెన్ ధేనువు దర్శనీయు బటపాక స్వర్ణవర్ణున్ వినూ
తన సర్వాంగ సమగ్ర సుందరు వినిద్ర జ్ఞాన వైరాగ్య భా
వను విశ్వైక విలోభనీయ గుణ సంభావ్యున్ దపోయోగ పా
వనదీక్షానిరతున్ సుతున్ జనులకెల్లన్ మోదముప్పొంగగన్. 125

వ. అంత నాత్మ దేవుండు ధేనుసూనుంగాంచి యత్యంత విస్మయుండును ప్రమోదభరితుండునునై ప్రసన్న మానసంబున నతనికి జాతకర్మ నామ కరణాదులు మహా వైభవంబుగా నిర్వర్తించి గోకర్ణంబు లుండుటంజేసి గోకర్ణుండను నామంబిడియె. సకల జనంబులు జనుదెంచి సంభ్రమాశ్చర్య ప్రమోద మానమానసులై యతని యసాధారణాతిలోక దివ్యతర తేజోగరి మంబునకు నరుదంది వీతండు దేవరూపియగుంగాని యితరుండు గాడని భావించి యాత్మదేవుని పూర్ణపుణ్యాతిశయంబునకు మెచ్చి యానందించి, యతని యుదయంబు తమకు మహోదయంబని మహోత్సవంబులుసేసి, పరమానందంబునం బొదలుచుండిరంత, గొంతకాలం బత్యంత తృప్తి కరంబుగజనసబ్బాలకు లిరువురు సమవయస్కులగుట వారికి బాల్యంబేది తారుణ్యంబు దలసూపుచుండ నయ్యిరువురిలోన బిన్నయగు. 126

ఉ. స్వర్ణసమప్రభుండు నిజవర్ణ సమంచిత ధర్మరక్షణో
దీర్ణమనస్కుఁ డత్యమలతేజుఁడు జ్ఞానవిరాగ నిత్యసం
పూర్ణుడు సర్వలోక పరిపూర్ణయశోంచితుడై తనర్చుగో
కర్ణుడు స్వప్రభావహత గాఢతమోన్య హృదంధకారుడై. 127

వ. వెలుంగొందుచుండె మరియు నతని పూర్వజుండగు ధుంధుకారి. 128

సీ. స్నాన సంధ్యాదిక స్వకుల కర్మవిహీను
డత్యంత దుర్లక్ష జాభిరతుడు
క్రోధ సంయుతు డార్యబాధా వినోదుండు
దుష్పరిగ్రహకర్త దుష్ప్రియుండు
సర్వజన ద్వేషి చౌర్య ప్రవీణుండు
కృపణ దీనాంధాది హింసకుండు
చండాల వాటికా సంచరిష్ణుడు శస్త్ర
ధారి పరాలయ దాహకుండు

ప్రేత పిండోదనాదిక ప్రీతికరుడు
ద్యూతకరుడు నికృష్టుండు దుష్టతముడు
పరభయంకర భూరి దోర్బల యుతుండు
ధూర్తవర్తనుడై యొప్పె దుష్టమతిని. 129

వ. మరియు నతఁడొరుల పసిబిడ్డల లాలనంబున చంకనిడుకొని జని విజనంబైన యంధ కూపంబులందు బడవైచి వినోదించుచు, నొకతఱి నొకతఱి మహారణ్యంబుల దారులరికట్టి, బాటసారులం గొట్టి, వారి యొరంగల సర్వస్వంబు గైకొని, వారి హింసించుచు, నొకసమయంబున నట్టనడురేయి సంపన్న గృహస్థులయిండ్లం గొల్లగొట్టి కనక రత్న భూషణాంబరాది ధనరాసులందెచ్చి జూదంబులాడుచు, పుణ్యాంగనా మాన ప్రాణాపహరణంబు సేయుచు, సజ్జనకంటకుండయి వర్తించుచుండి, యొకనాడు జూదంబున పణంబోటువడి యెయ్యెడ ధనంబు లభింపకున్న, నిజ గృహంబున కరుదెంచి, జననీ జనకులం బట్టి చావమోది, పాత్రాదికంబు లెత్తుకొనిపోయిన, నాత్మదేవుండతని దుష్టారంభంబునకు కడుంగడు వగచి,

వాపోయి, యిట్టి కుపుత్రత్వంబుకంటె నపుత్రత్వంబు యుత్తమంబని
దలంచి యింక నెందు నివసింతు? నెటకేగుదు? దారి యెయ్యది? యెవండు
నా దుఃఖంబు బాపగలండు? నాకెట్టి దుర్గతి వచ్చె? నికెట్టులని విలపించ
నా సమయంబున, దైవ యోగంబునంజేసి గోకర్ణుండయ్యెడ కరుదెంచి,
తండ్రి కభివాదనంబుగావించి, యాతనికి గలిగిన యాపదనరిసి సప్రే
మంబుగా, సవినయంబుగా, విశేష జ్ఞానభాసురుండగుట వైరాగ్య స్వరూపం
బిట్టిదని సనిదర్శనంబుగా జనకు దెలుపదలచి. 130

సీ. సంసార మధిక నిస్సారంబు బహు ఘోర
 మతి దుఃఖకరము మోహావహంబు
తనయు లెవ్వరివారు ధనమది యెవరిది
 యెవరి పశువులవి యెవరి గృహము
చనుదెంచు నాడేని చనియెడు నాడేని
 యొంటరి వేగాక జంటయున్నె?
చక్రవర్తికినైన స్వారాజ్య మేలెడు
 మర నాయకునకైన సుఖము గలగె

ప్రణయ వంతుడు నిత్యంబు జ్వలన మందు
నాలుబిడ్డలు నిలువాకిలనెడు మోహ
ముడుగు మజ్ఞానము నరక మొందజేయు
నరయ వైరాగ్య మన్నిటికన్న సుఖము. 131

వ. ఈ తనువేనాటనైన నీటిబుగ్గ చందంబునంగుట నిక్కువంబు నీతనువే
నీయదిగానినాడు, తదితర వస్తుజాతంబులు నీయవియెట్లగు? కర్మ
ప్రవాహవశంబున కొంతకాలం బొక్కెడజేరి తత్తత్కాలోచిత సుఖ
దుఃఖంబు లనుభవించి, యాఋణ రూపకర్మంబుదీరిన, నెవరిదారివ
వారరిగెద రంతియగాక, తత్కర్మకు పూర్వంబునను. నాశనానంతరంబు
నను నెవరికి నెవరగుదు రందరకా సర్వశక్తి సమగ్రుండగు సర్వేశ్వరుం
డొక్కడే దిక్కగుంగావున, మిధ్యారూప భ్రమవదలి యారంభ
పేశలంబులై, పరిణామ ఘోరంబులగుచు సుఖాభాసంబులైన భోగ భోగ్య
భోగోపకరణంబు లన్నియు నాసతో నిర్మూలంబుగా నూడ్చి, పారవైచి

పరమ వైరాగ్య సంపన్నుండవై వనంబున కరిగి యచట నిత్యైకాంత జీవనుండవై, మునివృత్తి నవలంబింతువేని నీకు నిరత నిర్మలానంద శాశ్వత బ్రహ్మానందం బొదవునని జనకునకెఱింగించ నాత్మదేవుండు. 1 2

చ. సముచితమౌచు నాత్మహిత సాధకమైన కుమారు దివ్య బో
ధము దగనాలకించి ప్రమదంబునగానకు బొదలంచి త
త్వము వచియింపుమయ్య సవిధానముగా విని నేమొనర్తు శీ
ఘ్రము తనుజాతరూపమును దాల్చిన యో జగదేక దేశికా! 133

శా. కర్మప్రేరణ స్నేహపాశముల చక్కంబట్టి బంధించినన్
నిర్మర్యాద భవాంధ కూపమున వేసెట్టం బడందోచి రా
దుష్కార్గాహితులేచి తావకవచోత్తుంగాపి తద్బంధమున్
నిర్మూలించి సముద్ధరింపు నను తండ్రీ సౌఖ్య నందాయివై. 134

వ. అని యార్తిని బ్రార్థించిన ద్రవీభూత హృదయుండై గోకర్ణుండు. 135

సీ. దుర్మాంస రుధిరాస్థి దుర్గంధ భూయిష్ఠ
కాయాభి మానంబు బాయద్రోపి
జాయా సుతాలయ సంపదాదుల యందు
మమకార మింతట మానివైచి
పరగుణ దోషంబు లరయక నీలోక
ధర్మంబు లెల్లను దలగద్రోసి
కామ తృష్ణాదుల కడక రూపడగించి
ధర్మాను భజన మెంతయు రచించి

సాధుపురుషుల సేవించి సంతతంబు
జ్ఞాన భక్తి విరక్తుల జతను పరచి
భాగవత కథామృత నిషేవణ మొనర్చి
గాంచుమట నీవు నిత్యసౌఖ్యంబు దండ్రీ! 136

మ. అన పుత్రోక్తివశాన నిల్వదలి డాయంజేరె వాషష్ఠి హా
యన వర్షీయుడు బ్రాహ్మణోత్తముడు దుర్గారణ్య భాగంబునం

దయంబున్ స్థిరచిత్తుడై హరి పద ధ్యాన స్తవారధనా
ర్చనకేళిరతి ముక్తిగాంచె దశమస్కంధోక్త మార్గంబునన్. 137

వ. అని యమర మునిసత్తమునకు కుమారసనకాది వాచంయమి చంద్రు లెరింగించిరని సూతపౌరాణికుండు శౌనకాదులకు దెలుపుటయు. 138

చ. శరముఖ శోషితాంబుధి విశాల భుజాంతర పీవరాంస, తా
మరస దళాయతాక్ష! మునిమానస సౌధవిహార! కోసలే
శ్వర! చిరపుణ్యసార! జితభార్గవరామ! వివస్వదన్వయా
భరణ! కృపాతరంగ! నతవత్సల! సంగరరంగ పండితా. 139

కం. సాకేతనగర లక్ష్మీ
సాకల్యైశ్వర్య భోక్త! జనక తనూజా
కోక కుచార్ద్రాది లేప
వ్యాకీర్ణో రస్క! రామభద్ర మహీశా! 140

మాలిని :- సజల జలదవర్ణా! చారుకారుణ్య పూర్ణా!
వ్రజన వనకుతారా! వేదచూడా విహారా!
సుజనసుఖవిధాయీ! సూరిమోదప్రదాయీ!
విజితపరశురామా! విశ్వలోకాభిరామా. 141

గద్యము :- ఇది శ్రీరామచంద్ర సహజకరుణా పరిలబ్ధ, సరసకవితా భాజన, భోజనపల్లి కులపవిత్ర కృష్ణ దేశిక పుత్ర, సుజన సేవార్య, వేంకటార్య ప్రణీతంబయిన శ్రీ భాగవత మాహాత్మ్యంబునందు ద్వితీయాశ్వాసము సంపూర్ణము. 141

స ం పూ ర్ణ ము

# శ్రీమద్భాగవత మాహాత్మ్యము

## తృతీయాశ్వాసము

కం. శరణాగత విమతానుజ
కరుణార్పితరాజ్య భక్తకల్పక గంగా
ధర చిరకీర్తిత నామా
తరణి కులాం బోధి సోమ దశరథరామా! 1

వ. దేవా! అవధరింపుము వివిధ పురాణేతిహాసకథా కథనాతి చతురో
పేతుండగు సూతుండు సకలపుణ్య కథా శ్రవణ ప్రవణుండైన శౌనకు
దుంధు కారోదంతం బిట్లని వివరించె. 2

మ. జనకుం డేగిననాడు నాటను దురాచారాతి లోలత్వమే
పెనయం దల్లి విబట్టి కొట్టి వెలుచన్ హింసించి విత్తంబు జూ
పవిచో పీ విధనంబు దప్పదనుచున్ భ్రాంతాత్మయై యొక్క రే
యివి నూతింబడి చచ్చె ధుంధులి సుదుష్కృత్యంబు సోకోర్వకే. 3

వ. అంతవిక ధేనుసూనుండు, 4

శా. గోకర్ణాఖ్యుడు తీర్థయాత్ర కరిగెన్ గోకర్ణ కేదార మా
యా కాంచీముఖ దర్శనీయ తమ పుణ్యక్షేత్ర సందోహ సే
వా కౌతూహలియై కళిందతనయా భాగీరథీ సింధు రే
వా కావేరి ముఖాతి పూత తటినీ వ్రాతంబులం దోగుచున్. 5

మ. హితులవిలేరు, లేరురిపులెవ్వరు కష్టసుఖంబులన్న దు
ల్యతగనువాడు సాధుజనతా ప్రతిపత్తి యొనర్చువాడు సం
తత వియమాను పాలకుడు దారతవః పరిపూత శాంతసం
స్కృతమతి ధేనుజాతు డొవరించుచుమండె సమస్త యాత్రలన్. 6

వ. ఇట్లు గోకర్ణుండు పుణ్యయాత్ర లొనర్చుచుండ నతని పూర్వజుండగు ధుంధుకారి విలాసినీ జన వశంవదుండై. 7

ఉ. వారవధూటులన్ నిజ నివాసము నందు వసింపజేసి యా
క్రూరుడు వారలన్ మనుప ఘోర వినింద్యము లాచరించుచున్
వారల కోర్కెదీర్ప నొకపట్టున నొక్కనృపాలు భూరి భాం
డారము దొంగిలించె నిబిడంపు నిశీధిని పాటవంబునన్. 8

వ. ఇట్లు కామాంధుండై మీఁద మూడనున్న మాప్పుం దలంపక తాను సాహసంబున కొల్లగొట్టిన సమృద్ధ ధనరాసు లింటనింపుకొని కొన్ని వస్త్రాభరణంబులు కొంత ధనంబు తన దాపున్నదు గత్తెలకిచ్చినంత నాటి రాత్రి యతండతి గాఢనిద్రా పరవశుండై యున్నతటి యక్కులటలు తద్ధనరాశులెల్ల గంటయుం జూచి రిప్పుపడి యొక్క యేకాంత ప్రదేశంబుం జేరి స్త్రీ సామాన్య సహజ చాపల్యంబున. 9

చ. తెలిసెనె దొంగ యీ చెనటి తెంపున విత్తము ద్రవ్యమిట్లు తె
క్కలిగొని తెచ్చు దీని మహికాంతుడెఱింగిన వేగివచ్చు నీ
ఖలుని వధించి విత్తమును గైకొని యెయ్యెడకైన బోద మం
చల కులటాజనంబులు రహస్యముగా దలపోసి యంతటన్. 10

వ. అందరొక్కుమ్మడి వాని పయింబడి దృఢతర పాశంబులం బంధించి యా తోడన.

ఉ. పాశము కంఠమందు బిగవైచి కరంబిరువాగు మృత్యు సం
కాశలువట్టి లాగినను గాని మృతిం గనకుండినన్ దయా
లేశములేక వోసిరి జ్వలించెడు వహ్నికణంబులన్ దురా
దేశ విమోహితాత్మలయి ధృష్టల పైఖరి వాని మోమునన్. 11

మ. అనలజ్వాలల గ్రాగి యాతనకు లోనై ప్రాణముల్ వాసె దో
డన గర్తంబున దత్కళేబరము నెట్టన్ గ్రక్కునన్ బూడ్చి రం
తన వారైదుగు రైదుభాగములుగా దద్విత్తముం బంచి గై
కొనిరా సాహసురాండ్రు కామినులు పెక్కుల్మాట లింకేటికిన్. 12

వ. దైవవశంబున నీ రహస్యంబెవ్వరికి దెలియదయ్యె నంతగొన్నిదినంబులకు దుంధుకారి గానరామి లోకులతనిం గురించి నా జగజంతల విచారించ నాత్మలందిడియు యస్మత్ప్రిమాద తరణావసరంబని యెంచికొని చతుర గంభీరంబుగ "ధన సంపాదనార్థంబు దేశాంతరంబున కేగిన వాడర్జ్ఞాన పరుకిల్లు, వాకిలి, చెలులు, చుట్టాలు, సుఖదుఃఖంబుల నెరుంగరుగాదే! యతండేగు సమయంబున నీ వత్సరాంతంబున నరుదెంతు ననియె"నని వారి నాశ్వాసించి ననుపుచుండిరి. గావున విద్వాంసులైన వారాంధ్రయెడ విశ్వాసంబు సలుప నేర రన్యుండు బుద్ధిహీనుండై యట్లు నలిపెనేని దుంధుకారుని భంగి యగు. 13

తే. కాముకులకెన్న రసపోషకంబు లగుచు
పలుకు లమృతోప మంబులై యలరు చుండు
హృదయ మసిధార వలె నెఱపద నెనంగు
నెవడు ప్రియుడింక వింతుల కీ ధరిత్రి 14

వ. ఇక వారిచే మరణించిన ధుంధుకారి. 15

మ. తనగావించిన దుష్క్రియా గరిమచేతన్ హేయ ప్రేతత్వమున్
గని వాత్యామయమూర్తియై దిరుగుచున్ గారించు బేరాకటన్
వనటం జెందుచు వానకుం జలికి నోర్వన్‌లేక బీరెండ తా
కున కగ్గంబయి గాలిదూలి యెట దిక్కున్‌గాన కల్లాడుచున్. 16

వ. ఎన్నియో కష్టంబులకు గురియై శాంతి విశ్రాంతు లొక నిమిషంబైన గానక చిడిముడి పాటొందుచు తృష్ణార్తితుండై వల్గడల పరిభ్రమించుచుండె అంత కొంత కాలంబున కెట్లో లోకంబువలన దుంధుకారి మరణవార్త నెఱింగి దయాళుండైన గోకర్ణుండ గతికుండైన తనయన్న ప్రేతత్వ విముక్తికై గయాశ్రాద్ధంబు గావించి యటమీద దా నేయే పుణ్య తీర్థంబులకరిగె నా యా స్థలంబుల బిండప్రదాన జల తర్పణాదిక శ్రాద్ధంబులు గావించుచు నొక్క సమయంబున. 17

ఉ. అర్ణవ వేష్టితాఖిల ధరాంతర సంస్థిత పాపహార కో
దీర్ణ మహా నదీద్విమల తీర్థ విగాహ పవిత్రమూర్తి గో

కర్ణుడు నేగుదెంచెను వికామ తపోమహితాను భావ సం
పూర్ణుడు జన్మదేశమును బూతముసేయగ నాదరంబునన్. 18

వ. అట్లు. 19

చ. తిరుగుచు ధేనుజాతు దరుదెంచి నిశిందనయూరు జేరి తా
బరుల కగోచరుండగుచు వచ్చి స్వకీయ వికాయ చత్వరాం
తరమున బవ్వళించిన యుదారుని గన్గొని "ధుంధుకారి" సో
దరుడని యెంచి చూపె సముదగ్ర వికోరు భయానకా కృతిన్. 20

మ. ఒకమాటు న్మదకుంభియై భయద దంష్ట్రోగ్రంపు శార్దూలమై
యొకటం గాసరమై యొకంట వృకమై యొండొక్కటన్ భోగియై
యొకటం బావకుడై మహేంద్రుడయి వేరొక్కంట మర్త్యుండునై
యొకటం దోచెను ధుంధుకారి నిజమాయా జాలముల్ జూపుచున్. 21

తే. చెలగి యీ విధి వాడు రచించునట్టి
వైపరీత్యంబు లన్నియు బారజూచి
యతడదెవ్వడొ నొక్క యుగతికు డిట్టు
లయ్యెనని యెంచి వానితో ననియెనిట్లు. 22

ఉ. ఓయి యెవండవీవు? సురవాక్కొ! పిశాచమ వాక్కొ! భూతవై
తేయులలోన నొక్కడవొ? దెల్పుము మాయలు చాలువింక, నీ
కాయము జూడ ప్రేతదశ గాంచిన చందము గావిపించు న
య్యా, యెఱిగింపు మిట్టిగతి, నందుట కేమికతంబు నాకికన్. 23

ఉ. అంచిత పూర్వజన్మ సముపార్జిత విస్తుల పుణ్యరాశి దో
తెంచిన పోల్కి జేరనరుదెంచి దయామతి నట్లుదన్వి చా
రించిన యమ్మహా గుణ గరిష్ఠునకున్ విజ వృత్తమెల్ల భా
షించెదు శక్తిలేకునికి జేసయిగన్ దెలియంగ జేసినన్. 24

వ. అప్పరోక్షజ్ఞాన సంపన్నుండు లక్షించి. 25

చ. పలికెడు శక్తిలేకునికి భావమునం దలపోసియాతడం
జలి జలమెత్తి వానిపయి జల్లినయంత గతాఘుడై విశ్వం

ఖలముగ నీవిధంబు పలుకం గడగెన్ మొదలింటినుండి యా
కలిత తపోవిధానమయి గ్రాలువిజానుజు నమ్ముఖంబునన్. 26

ఉ. భ్రాతను ధుంధుకారి యనువాడ స్వయంకృత బాపకర్మచే
బూత మహీసురత్వమును బాసి నికృష్టపు బ్రేతరూపినై
యాతన దోగిదోగి యవిలాశన వృత్తిజరింతు నిత్యమో
భూతదయాధురీణ ! గుణభూషణ ! యేగతిలేక దీనతన్. 27

మ. అనఘా ! తమ్ముడ భ్రాతృవక్ప్రల నితాంతానహ్య దౌర్గత్య, మో
చనముంజేసి సముద్ధరింపు వడి, పాశెన్మత్పురా మోఘపా
వనపుణ్యాయత ! ధేనునందన ! జగద్బంధూ ! ప్రసన్నాత్మయీ
ఘన దుర్వారతరోగ్ర తాపమున కాగన్‌లేను నేవింపుకేన్. 28

వ. అని పలుదెఱంగుల దన దీనావస్థ నెఱింగించుచున్న నమయంబున. 29

శా. గోకర్ణుం డతడన్నదెల్ల విని నీకుం బ్రేతభావం బిటుల్
రాకుండన్ వలెనంచు నే గయకు జేరంబోయి శ్రాద్ధంబటన్
పాకల్యంబుగ జేసి జేసితినొగిన్ స్వర్వాహినీముఖ్య నా
నా కల్లోలవతీ మతల్లికల లోనం బిండదానంబులన్. 29

వ. అని మరియు నిట్లనియె. 30

కం. తలప గయాశ్రాద్ధంబున
దొలగని ప్రేతత్వ ముడుగు తోయ మికెందున్
గలుగం బోదన్యం బటె
గలిగిన వచియింపు దాని కలరూపెరుగన్. 30

వ. అనిన ప్రేతభ్రాత మరల నతనికిట్లనియె. 31

తే. ఒక గయాశ్రాద్ధమున నేల యుడుగలేద
టంచు విస్మయమందె దీ వట్టి వాక్కు
శతమునకు గావి మత్పాప శమనశక్తి
కలుగ నేరదటం చెద దలుపుమింక. 32

ఉ. గావున సాధనాంతర మొకండు విచారముజేసి వేగనన్
బ్రోవుమటన్న తద్వచనమున్ విని విస్మయ మంది లోక సం
సేవితమై దనర్చు గయజేసిన శ్రాద్ధశతంబు చేత నుం
బోవని యీ భవద్గతి విముక్తి యసాధ్యమదెన్ని భంగులన్. 33

తే. అయిన దేమైనగాని నిర్భయ మెసంగ
నేగి నీచోట నీవుండు మింతనుండి
తావకోన్ముక్తి సాధనాంతర మొకండు
నే విచారించి గావింతు నిక్కువంబు. 34

వ. అని యభయం బొసంగిన. 35

మ. అనుజాజ్ఞంజనె ధుంధుకారి తన యావాసంబు డాయంగ గో
తనుజాతుండట దత్సముద్ధరణ చింతన్ రాత్రివేగించె నం
తన వేడ్కన్ సుచిరాగతుండయిన యాధన్యున్ విలోకించి, నా
య్యాన నేతెంచి బహూకరించెను జనం బాబాల గోపాలమున్. 36

వ. అట్లు బ్రాహ్మణాది చాతుర్వర్ణంబు సప్రేమంబుగా సందర్శనంబున కరుదెంచి సేవించి, బహూకరించి దీవించి ఉచితక్రమంబున స్వాగతాద్యుపచారంబు లానర్చి పరమానంద భరితులైరి అందు కొందరు వృద్ధులు ప్రమోదానురాగంబులు పొంపిరి వోవ నోయిగోకర్ణా! యెందరిగితివి? యే యే పావన క్షేత్రంబులు సందర్శించితివి? యే యే పుణ్యతీర్థ రాజంబులం గ్రుంకితివి? యే యే వింతలు గనుగొంటివి యవియెల్ల వివరించవే, ఓ జగత్కల్యాణకారణ! అస్మదీయ బహుజన్మ పుణ్యవాసనం గాక నీయట్టి సాధూత్తములం బడయ గలుగుదుమే? మానోములు ఫలించె, మా తపస్సిద్ధి యొదవె, మా పుట్టువులు పూజ్యంబయ్యె చరితార్థులమైతిమని ప్రశంసించిరి, అంత నతండమ్మహా జనంబుల యథార్హ ప్రణామ బహూకరణా లింగ నా శీర్వాదా భి నందన కుశల ప్రశ్నాను పూర్వకంబుగా నభినందించి యాభిజనోత్తములతో దానటువాసి జనిన నాటనుండి నేటిదాక గల వృత్తాంతంబంతయు సవిస్తరంబుగ నుడివి దోడన. 37

ఉ. తానరుదెంచుటల్ మొదలు తన్మిషి సంఘటితంబుసర్వమా
ఖ్యాన మతండొనర్ప విని యందు వసమ్బులు యోగసత్తమ
జ్ఞానులు బ్రహ్మవాదులును సత్పురుషుల్ బహుశాస్త్రజాత మం
తైనను గాంచి గాంచి యనవైకి వదీయ విముక్తి మార్గమున్. 38

మ. అనఘుల్, ఘాతపరాయణుల్ బుధులు హాలా ప్రేత సంస్కార సా
ధన మెంచుంగనలేక యుండుటకు మార్తాండోక్తి అత్యంతబుగా
గావెరంతన్ విలిపెం బలంగు రథమా గోకర్ణు డత్యూర్జితా
త్మ నిరూఢామలభక్తి సంపద వినమ్ర ధ్యానము నంద త్తరిన్. 39

వ. అట్లు నిలిపి గోకర్ణుండు పరమభక్తి నాదిత్య దేవతాకంబులైన వేద మంత్రోచ్చారణ పరుండై యేకతరనిష్ఠా గరిష్ఠుండై కర్మసాక్షియగు రవి నుద్దేశించి. 40

మ. చపలుండై మతిమాలి జేసిన దురాచారంబునంజేసి య
చ్చపు బ్రహ్మత్వము గోలుపోయి కుటిల ప్రేతత్వముం గాంచె నీ
యపరాధిం గృపజూచి ముక్తి తెరువే దైనం బ్రసాదింపుమో
తపనా! భాస్కర! లోకబాంధవ! జగత్సాక్షీ నమోవాకముల్. 41

వ. అని ప్రార్థించిన ధుంధుకారి ప్రేతత్వ విమోచ నార్థంబుగా గోకర్ణ నంస్థంభితుండయి యప్పుడు. 42

ఉ. ఆ హరిదశ్వదామనవి యాదరతన్విపి యానతిచ్చె, వ
ప్తాహములందు భాగవత పుచ్ఛపుభక్తి పఠింపుమెట్టి వం
దేహములేక ముక్తుడగు ధేనుజ! యంచు దవీయ మంజుల
వ్యాహృతులెల్లరున్ వినెడునట్లుగ నస్ఫుట వాక్య పద్ధతిన్. 43

తే. ధర్మయుతము సద్యఃఫల దాయకమ్ము
సులభ సాధ్యంబునై యొప్పు సూర్యువలుకు
లచటి వారెల్ల రెంతయు నాలకించి
హర్ష సంపుల్ల చిత్తులై రెరి కరము. 44

వ. అట్లు విని వారు బహు సుకరంబు, నవశ్యా చరణీయంబు నగుట వద్యః కర్తవ్యంబని యేక మనస్కులై విశ్చయించిరంత గోకర్ణుండదుం కంగీకరించి స్వయంబుగా శ్రీమద్భాగవత సప్తాహ వాచనంబునకు ప్రవర్తించె నా సమయంబున. 45

మ. తనరన్ భాగవతామహాకథన చేతః ప్రీతి నేతెంచి రం
తన పౌరుల్ నృప వైశ్య శూద్రులును విద్వాంసుల్ కవుల్ పామరుల్
జనుషాంధుల్ జడ మంద పంగు బధిరుల్ సన్యాసులున్ యోగు లా
య్యన నల్దిక్కులనుండి పాప పరిహారార్థంబు నచ్చోటికిన్. 46

వ. అట్లు గోకర్ణ కరిష్యమాణ సప్తాహ భాగవత పారాయణ కథాశ్రవణార్థులై పుర గ్రామ జనపద పక్కణాది వివిధస్థాన సమాగత జనకదంబ సమాకులంబును పార్వతీయాటవికాది బహుళాకీర్ణంబునునై నాస్థలంబు యెందుజూచిన నిసుము జల్లిన రాలని చందంబున బంధురంబై దేవాశ్చర్య కరంబునై యొప్పె అంత గోకర్ణుండు శ్రీభాగవత వాచనార్థం బాసనోప విష్టుండగు చున్నంత ప్రేతత్వాపన్నుండగు దుంధుకారి బయల వాయు రూపధరుండై యుండ నాశక్యంబైన నందంద బరికించి తనకదెదుర నొక యెదురు పొద దట్టంబై పెంపార గనుంగొని నయ్యేరంబున దూరి యందు పండుచెదురొక్కండు సప్తస్వర సమంచితంబై యుండుచెఱింగి, తన్మూలంబున సన్నని నెఱియంజూచి తన్మధ్యంబున వాయు రూపంబున దూరి నిలిచె అత్తరి గోకర్ణుండు పరమ వైష్ణవుండైన బ్రాహ్మణోత్తము నొక్కని తన సమ్ముఖంబునందు చితాసనంబున నునిచి యర్చించి, శ్రోతగా నేర్పరచుకొని ప్రథమస్కంధ ప్రభృతి ద్వాదశ స్కంధ పర్యంతంబు క్రమంబుగా స్పష్టఫణితి బఠించి వ్యాఖ్యానించ నుపక్రమించె. 47

చ. మధుర మృదు స్ఫుటార్థ రసమాధురి సౌరభ వాసితంబుగా
బుధ జడ పామరాశయ సముజ్జ్వల రంగములందు భక్తివల్
విధముల లీలలన్ నెరప విశ్రుత భాగవతా మహాకథా
కథన మొనర్చె గోసుతు డఖండతర ప్రతిభాళి రాముడై. 48

మ. దివసాంతంబగు నంతకుం బరమభక్తిం దత్కథా ఖ్యానమున్
సవిమర్శంబుగ జేయుచుండగ మహాశ్చర్యంబుగా దన్మహో
త్సవ సౌభాగ్య విలోకనాగత సమాజంబెల్ల వీక్షింపగా
రవమేపారగ నయ్యె కీచక కఠోర గ్రంథి విచ్ఛేదమున్. 49

వ. ఇట్లు ద్వితీయ తృతీయ దివసంబులయందు విశాముఖ సమయంబునంద, తదీయ ద్వితీయ తృతీయ గ్రంథి విచ్ఛేదనంబగుచు క్రమంబున సప్త వాసరావసానకాలంబున సప్తమపర్వంబును విచ్ఛేదంబయ్యె అంత సప్త వాసర శ్రీమద్భాగవత కథాశ్రవణ ప్రభావంబునంజేసి నిజ వీచ ఘోరా సహ్య ప్రేతాకారం బుజ్జగించి 50

మ. వనమాలాంచిత భూరివక్షుడు చతుర్బాహుండు పీతాంబరుం
డు నవాబ్జేక్షణు డుల్లసన్మణి కిరీటుం డంబుదశ్యామ పా
వన దేహుండయి దుంధుకారి హరిరూపశ్రీ వెలుగొంది వే
జని గోకర్ణ యటంచు దమ్ముని పదాబ్జాతంబున్ జాగిలెన్. 51

వ. ఇట్లు పరమ విశ్వాస ప్రణయ వినయాదు లొండొండ సందడింప, సాష్టాంగాలింగిత మహీతలుండయి యభివాదనంబు గావించి గోకర్ణు నుద్దేశించి. 52

మ. సదయా! దీనజనైక బాంధవ! భవత్సాద్గుణ్య కారుణ్య, సం
పద, ప్రేతత్వ దురంత కశ్మలము బోవం ద్రోచి విర్వాణ, మిం
పొదవన్ గూర్చితి! ధన్యమూర్తి సనుజా యెంతేనియున్ ధన్య మ
భ్యుదయా పాదకమైన భాగవతమున్ పూజ్యం బుపాస్యంబిలన్. 53

మ. అపవిత్రత్వ నివారకంబయి సమస్తాంహో వినిర్వాపణా
మపమానంబయి గోత్రసంచయ సుఖాయుశ్శ్రీ బలారోగ్య భా
గ్య పద త్వాదిక దాయకంబయి జగత్కల్యాణ సంపాదకం
బపవర్గ ప్రతిపాదకంబునగు సప్తాహంబు ధన్యంబిలన్. 54

వ. భాగవత సప్తాహ శ్రవణంబు నా యఘ పుంజంబులం బావకుండు సమిన్ని వహంబు లట్ల భస్మీ పటలంబు గావించె అస్మదీయార్ద్ర, శిప్ర, శుష్క,

లఘు, స్థూలంబులగు, జ్ఞాజ్ఞానః కృతంబులైన సకలదురిత ప్రళయం బీ కథాశ్రవణంబు గావించె, శ్రీ శుకశాస్త్ర కథా ప్రసంగంబులేక యజ్ఞాన వశంబున గలిగిన యమకంబున గండము దేరబెంచి పుష్టింజేకూర్చి రక్షించెదు నీ యనిత్యమైన శరీరంబు వలని ప్రయోజనం బేమి? అస్థి స్తంభంబు స్నాయుబద్ధంబు మాంసశోణిత లేపితంబును చర్మావనద్ధంబును మూత్ర పురీష పాత్రంబును దుర్గంధబంధురంబు జరారోగ విపాకార్తంబు సకలామయ నిలయంబు దుష్పాకరంబు దుష్పూరంబు దుర్ధరంబు దుష్టంబు దోషజుష్టంబు క్షణభంగురంబు నాతురంబు క్రిమివిడ్భస్మాంతంబు షడ్విక్రియా సహితంబునైనదాని శరీరంబని వర్ణింతురు. నిత్యంబుగాని మేనితో నిరపాయంబైన శాశ్వత సుఖంబొదవించు సత్కర్మంబును సాధింపలేనివాడవి విఫలంబగు గాదే? రేపటి వంటకంబు బాసిననట్టి యన్నరసంబున బెంపుగన్న యీ శరీరంబునకు నిత్యత యెక్కడిది గావున నీ శరీరాభిమానంబు వీడి శాశ్వత నిరవధికానంద ధామంబునకు యత్నించు నతడు మిగుల ధన్యుండు సప్తాహ కథాశ్రవణ ప్రభావంబున భగవంతుం డైన శ్రీకృష్ణుండా సన్నవర్తియగు గావున ననేక జన్మాంతరో పార్జితాఘ పుంజ నిర్మూలనార్థంబిది యొక్కటియ పరమ చరమోపాయంబు శ్రీ భాగవత కథాశ్రవణ నిర్జిత పాతకంబున బుట్టువంబులను జంతువుల సమకంబు లెల్లట్ల కేవల నాశంబుకే జనింతురు. జడంబయిన శుష్కవంశ గ్రంధి విచ్ఛేదనంబగుచుండ భాగవత కథావర్ణనంబున హృదయగ్రంధి విచ్ఛేదం బగుటేమి వింత. 55

మ. హృదయగ్రంధి విశీర్ణమైపను వివారించున్ సమస్తాఘముల్
తుదముట్టన్ బహుసంశయంబులడగున్ దోద్దోద కర్మాళి మా
న్య దయాముఖ్య గుణాళితో వెలుగు జ్ఞానజ్యోతి నానాశుభా
స్పద మాహాద్రసపూర్ణ భాగవత సప్తాహంబు నాలించుటన్. 56

వ. అని గోకర్ణు ప్రణయ పురస్సరంబుగా నాలింగనంబు జేసికొని, 57

సీ. పరమ ధన్యతమము భాగవతపురాణ
మఖిల సేవ్యముల సుఖాల యంబు
పరమ పదైక సంప్రాప్త సోపాయంబు
దారుణ ప్రేతత్వ వారకంబు

సంసారతాప ప్రశమ నౌషధ వరంబు
శ్రావక శ్రోత్రాది సౌఖ్య కరము
ఘోర పాపవనీ కఠోర కుఠారంబు
సప్తాహ హరికథా శ్రవణ మహిమ
ధేమనందన! నీ కృపాదృష్టి వలన
దుష్కరప్రేత బాధావిముక్తి గంటి
భాగవత కథాతీర్థ నివాస రతుల
కరయ జేతిలోనిది ముక్తి యనిరి బుధులు. 58

మ. అని యేకీతి ప్రశస్త భాగవత సప్తాహ ప్రభావాళి వ
ర్ణనముం జేయుతరిన్ సదస్యనియనానందంబుగా జేర వ
చ్చిన వైమానిక రాజ మద్భుత ఘట శ్రేష్ఠాంచితం బమ్మహా
ఘనుడా దుంధులి సూను డెక్కెను బహూ కారాను పూర్వంబుగన్. 59

వ. ఆ సమయంబున గోకర్ణుండు విష్ణు దూతలం గని. 60

చ. వలువురు (శ్రోత) లిందఱర వారలనెల్ల నొకంట దోడ్కొ పో
వలసిన చోట నిట్లు గావిచట్టి తిరేల వినా సమొందు వం
దఱగానితేక శ్రీహరి కథాశ్రవణంబు సమానమైనచో
ఫలమున భేదమెట్లొదవు భాగవతోత్తములార చెప్పరే. 61

మ. అనినన్ శ్రీహరి సేవకుల్ పలికిరయ్యా యిట్లు భేద మం
దిన దానన్ ఫలభేదమున్ గలిగె మా తీరయ్యె నాకర్ణనం
బున వీరెల్లరు సాటిలేని మననంబున్ జేయ రా రీతి నె
ట్టన నీతండుప వాసియై విమల చిత్తస్వాంత సద్భావమున్. 62

వ. అదియునుగాక పశ్చాత్తాపంబున వనస్థ విశ్రాంతమానసుండై శ్రవణ మన
నాదు లత్యంత తాత్పర్యంబున నేడహోరాత్రంబులు వవసించి వినెగావున
వితండట్టి వాడయ్యె మరియు 63

సీ. స్థిరచిత్త మెనయమి తెలివి రూపరిపోవు
దడబాటుచే విన్కి తప్పిఅమమ

మంత్రంబు సందిగ్ధమతి దారుమారగు
వ్యగ్రచిత్తతచేత వాడెచెడును
విష్ణు భక్తులలేవి విషయంబు ఖిలమగు
సత్పాత్ర మెనయమి శ్రాద్ధమడగు
వ్యర్థత గనుదాన మశ్రోత్రియునకిడ
కులమనాచారత గలతనొందు

గాన గురువాక్యమున నమ్మకంబు గల్గి
తనదు దీనత తలపోసి మనసులోని
నిఖిల దోషమ్ములను వీడి నిర్మలైక
భావమున జేయు శ్రవణంబు ఫలమొసంగు. 64

వ. గాన మరియు నింకొకమాటు సప్తవాసరంబుల శ్రీభాగవత మహాపురాణ కథాకథనంబు గావింతువేని తత్కథా శ్రవణాంతంబున శ్రోతలకెల్ల శ్రీవైకుంఠ నికేతనవసతి యవశ్యంబు సిద్ధించెడిని, గోకర్ణా! నీకు భక్తవత్సలుండైన పుండరీకాక్షుండు యనితర లభ్యంబైన గోలోకం బొసంగ గలడని పలికి విష్ణుదూతలు దుంధుకారి సహితంబుగా విమానా రూఢులై వైకుంఠాభిముఖులై జనిరిచట. 65

మ. భగవద్దివ్య గుణాభిరామమయి సేవ్యంబై సుఖాపాదన
శ్రవణంబౌ శుకశాస్త్ర ముత్తర రసార్ద్రంబైన హృద్యోక్తులన్
స్తవనీయంబుగ దెల్పె, శ్రావణ పునస్సప్తాహ కాలంబునం
దవధానంబుగ దేనువిందు శ్రవణానందంబుగా సర్వమున్. 66

వ. ఆ పునస్సప్తాహ భాగవతకథా సమాప్తి సమయంబున వియన్మండల మధ్య భాగంబు విదారించి మార్తాండ ప్రభావ దీరణా ప్రసన్న దివ్యతేజః పుంజం బున దిగ్దిగంత రాంతరాళ పరివ్యాప్తంబుగా నవతీర్ణంబు గావించి తత్త ద్భువనాధీశు లాబాల గోపాలంబుగ నరుదెంచి యొసంగు పరమారాధనం బుల మంగళ కరుణా తరంగితా పాంగావలోకంబుల నంగీకరించి కృతార్థీ కరించుచు మధ్యమలోక సౌభాగ్య గరిమంబున మహోత్కర్షంబుగా నయ్యెడకు – 67

మ. చనుదెంచెన్ హరి నిత్యసేవకులతో జంచత్కటాక్షాదు లో
య్యన సామాజిక మానసాంబుజ మరందాస్వాదముల్ జేయ భో
రన శంఖారవముల్ నమశ్శ్రుతు లుదారశ్రీ జయారావముల్
ఘనమై పర్వ విమాన కోటిగొని గోకర్ణుం బ్రసాదింపగన్. 68

మ. తనకుందానె ప్రమోద భారమున చిందంబొత్తి కృష్ణుండు, మె
త్తన గోకర్ణు కవుంగలించి తన చందంబూనగాజేసి చే
సె విశేషంబున। బీతవాసుల ఘనశ్రీ దీప్తులం గర్ణ వే
ష్టన కేయూర కిరీట ముఖ్య వర భూషాధారులన్ శ్రోతలన్ 69

మ. తనరన్ భాగవతా కథాశ్రుతికి నత్యంత ప్రహృష్టాత్ముడై
పనిచెన్ శ్రోతలతోడ దన్నగరి జీవవ్రాతమెల్లన్ బ్రియం
బున యోగి ప్రవరైక లభ్యమగుమం బొల్పారు వైకుంఠ ప
త్తనముం జేరగ దేనజాతువిక్రుపన్ శాద్వగ్వి మానంబులన్. 70

మ. దివిజేంద్రాదుల కందరానిదయి యాదిత్యామృతాంశూజ్వల
చ్ఛవికిం దవ్వయి నిత్యమైతగి ప్రశస్తంబైన గోలోకమం
ద వసించెన్ శుకశాస్త్ర సంశ్రవణ చేతః ప్రీతి నందేగి యా
భవ నీరేజభవాది వందితుడు గోపాలుండు గోకర్ణుతోన్. 71

మ. మును సాకేతపురీ నివాసులను రాముండెట్లు వెన్వెంట జే
కొనిపోయెన్ దలపోయ నిప్పుడటులే గొంపోయె కృష్ణుండు పా
వన సప్తాహ కథానక శ్రవణ సౌభాగ్యంబు చేకొన్న శ్రో
తృ నికాయం బెంతగలాదో। యంతయు సురర్షీంద్రా!
విశేషంబునన్. 72

వ అనిపలికి కుమార సనకాదు లమరముని నుపలక్షించి. 73

మ. ఘన గోకర్ణకథాక్షరాలి నెవడాకర్ణించు వో వానికా
జననీ గర్భనివాస దుఃఖమటుపై సంప్రాప్తిగాదన్న, పా
వన సప్తాహ కథా ప్రసంగ సహవాప్తంబౌ ఫలోత్సేకమే
మని భాషింపగవచ్చు దేవముని వర్యా! యింక మా బోంట్లకున్. 74

చ. కలుగను పూతభాగవత క్రమకథా శ్రవణైక లబ్ధమౌ
నెలవనిలాంబు పర్ణ ఫలభక్షణ దేహ విశోషణంబులన్
గలుగను విత్తయోగముల, గల్గదు తీవ్ర తపస్సమాధులన్
గలుగదు తీర్థసేవన మఖవ్రత దీక్షల నెన్ని దీర్చినన్ - 75

మ. వర గోకర్ణ కథాంచితంబయిన మీ భవ్యేతి హాసంబు న
క్షర సౌఖ్యాప్తికినై పఠింపు సతమా శాండిల్యుడన్ దాపసే
శ్వరు డత్యంత రసప్రబుద్ధమతియై సద్భక్తిదీపింపగా
పరమానంద పరిప్లుతాత్ముడయి భాస్వచ్చిత్ర కూటంబునన్ - 76

ఉ. ఈ యితిహాస మొక్కపరి యెట్టిడుగాని పఠించె నేనియున్
పాయు తదీయ పాపములు పైతృక కర్మములోన దీని, బా
రాయణ మొనరించు నెడ నావహిలన్ పితృతృప్తి నిచ్చులన్
బాయక నెవ్వడేన్ జదువ వానికిలేదు పునర్భవంబిలన్ - 77

వ. అని మరియు నారదునకు సనకాదు లిట్లనిరి. 78

మ. అమరర్షీంద్ర ! పవిత్ర భాగవత సప్తాహక్రమంబేము, స
ర్వము భాషింతుము నాలకింపుమిటు దైవజ్ఞున్ విచారించి, యు
త్తమ లగ్నంబొక టేర్పరించి సుహృదాప్త వ్రాతముల్ దోడుగా
నమితాసక్తిమెయిన్ సమస్తము సమాయత్తంబు జేయందగున్ - 79

వ. అందులకు జ్యేష్ఠాషాఢ శ్రావణ భాద్రపదా శ్వయుజ కార్తిక మార్గశీర్ష మాఘ మాసంబు లుత్తమంబులు శూన్యమాసంబుల నర్హంబులు గాన పై మాసంబులందు ముప్పది వాసరంబులు పూర్ణంబుగా గలిగిన మాసంబున, సప్తాహ భాగవత వాచక మహోత్సవారంభం బొనర్పందగు, నట్లు గావించి సకల దేశంబులం దద్వార్త బ్రహ్మక్షత్రియ శూద్ర జడ మంద బధిరాంధ ముఖ్యుల కెరుకపడునట్లు ప్రచారం బొనర్పించి "ఓ సమస్త దేశవాసులారా ! సత్పురుష సమావేశం బిందగు నిచటికి శ్రీ భాగవత కథా సుధా పాన తత్పరులు విచ్చేయుదురీ సప్తవాసరంబులు సుదుర్లభంబులు అపూర్వ రస రూపంబయిన భాగవతకథ యిట జరుపంబడు నని చాటి - 80

చ. సకల పదార్థముల్ వలయు చాడ్పున భూరి ధనంబు తోడ బెం
డ్లికి బలె సంతరించి శుభలేఖల బంధుకళత్ర పుత్ర మి
త్ర కలితులై యవశ్యముగ రాదగునంచు లిఖించి యెల్లవా
రికి మును మున్న సంపదగు ప్రేమ పురస్సరభంగి నారదా - 81

మ. అవకాశం బొక వాసరంబయిన జేయంబోల దిచ్చోట వై
ష్ణవులారా! క్షణమైన దుర్లభము గావన్ వేగమే రండు భా
గవతా క్రమ కథాసుధా రసము వేడ్కంగ్రోలు కాలంబగున్
సవిశేషంబుగ నంచు ప్రార్థనము విఖ్యాపంబునం జేయనౌ - 82

వ. మరియు సప్తాహ మహోత్సవ సందర్శనాతి కుతూహల సకలదేశ సమాయాత భాగవత సముదయంబులకు దత్తదుచిత వాసగృహంబు లేర్పాటు సేయబడి యింక నీమహోత్సవప్రకృష్ట జ్ఞానయజ్ఞంబునకు సమ విశాలాయత రమణీయ స్థల ప్రదేశంబు వలయు గావున దీని నొక్క పుణ్య తీర్థంబునందైన పావన వనంబునందైన సమకూర్ప, నింటియందు సలుప దలంచినయెడ గృహాంగణంబులైతి మొకచోనుంచి యతి ప్రయత్నంబునైనదాని వివరంబులకు మిన్నుటిన్మందిరంబు పరిష్కరించి పరార్థ్య పవిత్రాస్తీర్ణంబుల నలంకరింపవలె. 83

తే. సమవిశాలాయత ప్రదేశంబు గణగు
నవని శోధించి మార్జన మాచరించి
లేపనముజేసి రంగవల్లికల దీర్చి
ధాతు మండనాదికముల తగనొనర్చి. 84

చ. ఫలదళ సుందరంబయిన పచ్చి యనంటుల గ్రాలుకంబముల్
మలయ సమున్నతంబయిన మండపముల్ రచియించి కేల్ముకుల్
వలనుగ దీర్పించి నలువైపుల పుష్పఫలాఢ్యయుక్తమై
పొలుపగు వేదిగట్టి నలుమూలల పెక్కువు లెత్తగా వలెన్. 85

ఉ. ఆగమవేదిభూమి సురుడార్యుడు వైష్ణవ ధర్మకర్త దీ
క్షాగురు డత్యుదారమతి శాస్త్రవిధిజ్ఞుడు ధీరుడు త్తమో
ద్యోగి విరాగి నిస్పృహత యొప్పెడు వక్త యవశ్యమంచు స
ర్వాగమ మర్మకోవిదుల బిల్చి యీకథ నానతీయగన్. 86

ఉ. మావితధర్మదూరు డసమాన సుధీంద్రుడె యైనసత్కథా
ఖ్యాన విధిజ్ఞుడైన నగుగాక యనర్హుడు వేదబాహ్యు చం
దాన నెలంతలట్టులిక దత్పము డౌ హితకారి నొక్కవిన్
దానికి నూతగా నతవి పార్శ్వమునన్ నియమించు టొప్పగున్. 87

సీ. విశదమై తగునట్లు వెరవార సహోర్ధ్వ
లోకముల్ దీరి యాలోకములను
బారుల వైరాగ్యవంతుల మనుపనొ
నరవి యథోత్తరా సనము లందు
సముచితాస్తరణంబు పవదరింపగ నొప్పు
ప్రకట వైఖరిని వక్తకును మున్ను
వక్త ప్రాఙ్ముఖదయి వసియింప శ్రోతయు
నుత్తర ముఖుడయి యుండవలయు

వక్త యుత్తర ముఖుడయి వరగశ్రోత
ప్రాఙ్ముఖుండయి వివసింప వలయు జుమ్ము
కొన్ని తావుల నట్లు చేకూర దేవి
నుభయులకు ప్రాఙ్ముఖస్థితి యుచిత మరయ. 88

వ. కర్త ప్రతిదివసంబున కొకనాడు మున్న క్షౌరాదికంబుల గావించుకొని ఉపక్రమ దివసారుణోదయంబున విధ్యుక్తంబుగ మేలుకాంచి నిర్వర్తిత శౌచాది క్రియాకలాపుండయి ప్రయత్నంబున జాగరూకుండయి మంగళ స్నానాది విహితాహ్నికంబు లాచరించి సంక్షేప రూపంబున సంధ్యావంద నాద్యుచిత కృత్యంబులం దీర్చి. 89

సీ. ప్రాదీప్సితక్రియా పరిసమాప్తి నొనర్ప
నాది శ్రీగణనాథు నర్చనలిపి
పితృతర్పణ మొనర్చి విధ్యుక్త వైఖరి
యొనర ప్రాయశ్చిత్త మొప్ప దీర్చి
మండలం బొనరించి మధ్యంబునన్ కృష్ణ
మూర్తిం బ్రతిష్ఠించి పూజజేసి

కృష్ణు నుద్దేశించి బుక్కుఁ జదువుచు
పూజించి వలగొని మ్రొక్కి పొగడి
కర్మ సముపాత్త దుస్తరాజ్ఞాన లబ్ధ
భవ సముద్రాంతర నిమగ్ను భక్తు నన్ను
దీనబాంధవ నిర్వ్యాజ దివ్యకరుణ
యుప్పతిల్లగ వేగ సముద్ధరింపు 90

వ. అని ప్రార్థించి బరమ భక్తుండై - 91

సీ. శ్రీకృష్ణ పాదాబ్జ చింతనా సక్తుడై
భాగవతార్చక పాదు కొలిపి
పరమ ప్రసన్నైక బంధుర ప్రతిపత్తి
ఫల సమర్పణ జేసి ప్రణతు డగుచు
నానా విధానంత నామదివ్య స్తోత్ర
పారాయణ మొనర్చి పరమ నియతి
శ్రీపాద సన్నిధి జేరి భాగవతంబు
ప్రత్యక్ష కృష్ణుడే వా స్తవ మని
యెరిగి యంజలిబద్ధుడై హేయదూర!
నిత్యకల్యాణ షడ్గుణ! నిలయ! వరద!
పరమపావన! భక్తి సంబద్ధ హృదయ
ప్రణత భవనాంగణాంతర పారిజాత! 92

సీ. భవసాగరాంతర పాయకాగతికావ
నార్ధమీ యిలలోన నవతరించి
గో గోప గోపికా కుల విముక్తి నొనర్చి
దివ్య తావక సముదీర్ణ తేజ
మేకరసాకృతి నెనయించి శ్రీ భాగ
వతపురాణంబున పాదుకొల్పి
పతితపావనతా ప్రభావంబు పెంపూన
నట్లబవేశించితి వంబుజాక్ష

*

భయద భవపాశ నిర్ముక్తి బడయగోరు
నాయభీష్టంబు సఫల మొనర్పు మీవ
యితర శరణం బెరుంగని కృపణు నన్ను
నాద రించుభార మిక నీ యదియసుమ్ము. 93

వ. అని పరమదైన్యంబున ప్రార్థించి శరణాగతుండై విమల భయభక్తి తాత్పర్యంబుల తోడ వక్త సవిధానంబుగ నర్చించి వస్త్రమాల్య భూషణంబు లిడి, ప్రణయ పురస్సరంబుగా. 94

చ. సకల కళా ప్రపూర్ణ! శ్రుతిశాస్త్ర విధిజ్ఞ కథా ప్రబోధనా
ధిక చతురా! వదజ్ఞతను దీరిచి జ్ఞానమొసంగుమయ్య శ్రీ
శుక సదృశుండ వీవరయ చోద్యము దెచ్చుట నీకు లేదు, తా
వక కృపజేసి యీ జడిమవాపి సుఖించెద శాశ్వతంబుగిన్. 95

వ. అని సవినయంబుగా ప్రార్థింపవలయు. 96

తే. భిన్నగోత్రులు పాత్రులౌ విప్రవరుల
వరణ మొనరింప వలయును వారు, ద్వాద
శాక్షరీ మంత్రజపము సేయంగ వలయు
విధిదలిర్ప కథాభంగ నివృత్తికొరకు. 97

తే. నరవి శ్రేయోభివృద్ధికై శక్తికొలది
సప్తరాత్రముల్ కీర్తన సలుపదగిన
నియమముల బూని నేచేట నెఱపవలయు
నఖిమత పలంబు పూర్ణతా వ్యాప్తిజెంద. 98

తే. శ్రీహరికథా ప్రసంగ ప్రసిద్ధు లగుచు
ప్రతిఫలాపేక్ష నెరుగని భాగవతుల
కోరి పూజించి నియమించు కొవగనలయు
నాదరంబున హరికీర్తనార్థ మవట. 99

వ. వెండియు వారలకు ప్రణామంబు లాచరించి, తదీయాజ్ఞానుసారంబున నిజాసన సముపవిష్టుల గావలయు. 100

ఉ. దారధనాదులందు మమతన్ విడనాడి విశుద్ధ చిత్తులై
వారనిభక్తి కృష్ణపదవారిజముల్ హృదయాంబులోన నిం
పార భజించుచున్ మధురపాంచిత భాగవతార్థ సంశ్రవో
దార సముత్సుకుండయిన ధన్యుడు పూర్ణఫలంబు గాంచెడున్. 101

వ. మధుర గంభీరస్వరంబున సూర్యోదయంబుతోన మొదలిడి సార్ధ యామత్రితయాంతిక పర్యంతంబు కథావాచనం బొనరించి యంతనుండి విరామంబు గావించి, పిదప మధ్యాహ్నకాల ఘంటాద్వయానంతరంబున హరికథాకథన విశారదులగు భక్తులచే శ్రీహరి సంకీర్తనంబు జేయించవలయు. ఇట్లు దినంబును కథార్తియగు సతండు సప్తాహ భాగవత కథాకథన మహోత్సవంబు పరమప్రయత్నంబున సల్పుచు నిరంతరాయ పరిసమాప్తి పర్యంతంబు హవిష్యాన్న భక్షణ మాత్రంబున మెలంగుచుంట యుత్తమం బొక్కతరి యుపవశించి యే యుండనోపునేని యది సర్వోత్కృష్టంబు, లేనిచో ఫలాహారంబున నంటయును లెస్స యేయగు. ఇట్లుండ జాలండేని యేకభుక్తంబు గావించియైన కథవినందగు నిరంతరాయ కథాశ్రావణ సౌకర్యంబునకునై యే చందంబైన వలయునోపు. కథాకథన సామర్థ్యంబు కుంటుపడనియట్లు లఘ్వాహారం బొనరించుటయు సమంజసంబేయగు ఇంకను సప్తాహయజ్ఞ దీక్షితుండనుష్ఠించదగు నియమంబులు వివరింతు మాకర్ణించుమనదియని, నారదున కాదికుమార మునిచంద్రు లిట్లనిరి వైష్ణవ ధర్మదూరులకీ భాగవత శ్రవణాధికారంబు సిద్ధింపదు. బ్రహ్మచర్యాను పాలనంబును, నధస్సుప్తియు, పత్రావళీ భోజనంబును కథాశ్రవణార్థి శవశ్యా చరణీయంబులు 102

ఉ. కామము క్రోధమత్సర వికారములం దిగనాడి లోభమా
మద్దామ మదంబులంగడగి దమ్భాపరించి జగద్ధితామల
ప్రేమ మయాచ్యుతాంఘ్రియుగ సుశుభభక్తి సముగ్రుడౌచు ని
ష్కామత తత్కథాశ్రవణ కౌతుకిగావలె కర్త నారదా। 103

తే. భావదుష్ట పర్యుషితాన్న పారణంబు
వలదు మధు సూప తైలాజ్య పక్వభక్ష్య

భుక్తిదగదు గరిష్ఠాన్న భోజనంబు
పాడిగాదు కథావ్రత పరున కనఘ. 104

మ. పతిత మ్లేచ్ఛ రజస్వలాంత్యజ త్రయీబాహ్య ద్విజద్వేషి సం
హతితో భాషణసేయరాదు శుచి నిత్యాస్తేయమౌ నార్జవ
వ్రత దీక్షానియమానుపాలన దయాహారత్వ దాక్షిణ్య సూ
నృత శాంత్యాది గుణోన్నతాశయము లెంతే కర్త పాటింపనౌ. 105

ఉ. పాపులు భాగ్యవంతుల నపత్యులు దుర్గతరామయాది నా
నా పరితాపతప్తులు ననారత ఘోర దరిద్రతాతి బా
ధాపరిభూతు లెంతయు కథన్ వినజెల్లును బొందు మోక్షవాం
ఛాపరు లత్యవశ్యము ప్రశస్తకథా శ్రవణార్థులారయన్. 106

తే. శాకసంధ్యల పుష్పలౌ కమలముఖులు
వంధ్యలును స్రవద్గర్భలౌ వనితలెల్ల
గడగి సప్తాహ హరికథా కర్ణనంబు
సలుప దగుదురు తద్దోష శాంతికొరకు. 107

చ. గురువుల వైష్ణవోత్తముల గోవుల భూసురులన్ మహాత్ములన్
దరుణుల నాగమంబుల నుదార తపోవ్రత నిష్ఠులన్ గుణో
త్తర నరపాలపుంగవుల దార్కొని నిందయొనర్పరాదు ని
ర్జరమ నివర్య వింటె శుకశాస్త్ర కథాశ్రవణార్థి యంచుకేన్. 108

తే. వినదగు గళద్గర్భలౌ వెలదలెల్ల
హృద్య శుకశాస్త్ర సత్కథ లింపుమీర
నానదగు మృతార్భకలైన యబ్జముఖులు
చారు భాగవతకథా సుధారసంబు 109

వ. మృతార్భకలైన పొలంతులు మున్నుగువారు ముఖ్యంబుగా వినంగలుగుదు
రేని తద్దోషనివారణంబయి విత్త విరవద్య సౌభాగ్యంబులు సేకూరు,
సకలలోక కల్యాణ సంధాయకంబైన యీ జ్ఞానయజ్ఞంబు యథావిధి నొన
రించి యుద్యాపనంబు విధిక్రమంబున జేయందగు శ్రీకృష్ణ జన్మాష్టమం

దెట్లు కడుంగడు వైభవంబుగా నొనర్పవలయు నటించనుబగు భక్తులకు వ్రతోద్యాపనాకరణ ప్రత్యవాయం బొనవనేరదు శ్రీ విష్ణుభక్తి పరాయణులై, నిష్కాములగు భాగవతోత్తములు స్వతః పావనులగుదురు గాదే. అట్టి వారలకిక యొండేమియని యెఱింగించి, సనకాదులు నారదును పలకించి, శ్రీ భాగవత సప్తాహ వ్రతసమాప్తి కాలంబున నవశ్యంబుగా శ్రోతలు నిర్మల భక్తియుక్తులై పుస్తకంబునకును, హర్షోత్కర్షంబున పూజగావించుట ముఖ్యంబు పదంపడి శ్రోతృప్రముఖులకు ప్రసాద తులసీమాలికాదు లొసంగవలయు, సవిల మృదంగ తాళ లలితాంచితంబైన సంకీర్తనంబులు శంఖనిస్వనంబులు నమశ్శబ్దంబులు జయజయ నినాదంబు లత్యంతప్రమదంబున నొనరించి బహుళ మంగళవాద్యంబుల మ్రోయుకొలిపి, విప్రజనంబులకును యాచకులకును మృష్టాన్న దానంబు, సమృద్ధ విత్తంబుతో, నంబరాభరణాదు లొసంగి, పరితృప్తులం గావించనగునని సప్తాహ కరణ క్రమంబు వివరించి మరియు. 110

తే. ఇట్టి వారికి సకల లోకైక సౌఖ్య
జనక మైన భాగవత సంశ్రవణ మెలమి
ప్రాక్సమార్జితా ఘచయంబు బాపి నిత్య
నిస్తులానంద సంపత్తి నెసఁగజేయు. 111

సీ. సప్తాహ మభివిట్లు సంపూర్తి గనువేళ
కథకునకుం బుస్తక మునకును
పరమ భక్తిని పూజనలిపి శ్రోతలకు బ్ర
సాద తులసీ స్రజమ్ము లిచ్చి
మర్దల తాలాది మధుర స్వనంబుల
నమరార కీర్తన మాచరించి
జయ నమశ్శబ్దముల్ శంఖరవంబులు
భూరివాద్య ధ్వనుల్ మ్రోయజేసి
ద్విజ వనీపక ముఖ్యులై దేశికులకు
నిష్ట మృష్టాన్న విత్తములిచ్చి తనిపి
నెంచు నేమిట లోపంబు నొదవనీక
నిస్తులా నన్యభావన నెఱపవలయు. 112

ఉ. శ్రోత విరక్తచిత్తుడగుచో మరునాడు దయంబవశ్యమున్
గీత పఠింపనౌ నతడు గేస్తమానన్ విధిరీతి హోమమున్
జేత విధాయకంబనుచు జెప్పిరి కర్మ విదగ్రగణ్యు లి
జ్ఞాత భవాత్మ సంభవ! ప్రసన్నవ పైకథ నాలకింపుమా. 113

మ. అమరర్షీ! వ ధుసర్పిపాయస తిలాన్నాది ప్రయుక్తిన్ ప్రశ
స్తముగా హోమము జేయనౌను దశమస్కంధ ప్రతి శ్లోకమున్
క్రమతం దన్మయ మా పురాణ వరమౌగా దన్నిమిత్తంబుయు
క్తముగా వేల్వగనోపు పాపహితుడై గాయత్రిచే నైననున్. 114

తే. శాస్త్రచోదిత విధిప్రేల్వ జాలకున్న
నుచిత హోమ్యంబు బ్రాతున కొసగవలయు
నెలమి కృతకార్య ఫలసిద్ధి నెసయుకొరకు
దేశ కాలపాత్రాది విధిజ్ఞుడగుచు. 115

వ. మరియు న్యూనతాధికతాఖ్య దోషద్వయ నిరాకరణార్థంబును నానాఛిద్ర నిరోధార్థంబును శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రపారాయణంబు సలుపవగు. దానికంటె నితరం బధికంబైనదిలేదు. గావున తత్ప్రభావంబున సకల దోష విర్మూలనంబై సర్వంబు సఫలంబగు నిక మధుపాయసాది పంచ భక్ష్యాన్నంబు ద్వాదశ బ్రాహ్మణోత్తములకు యథేష్టంబుగా బెట్టి వ్రత పూర్ణత్వ సిద్ధికై స్వర్ణసింహాసనంబు సేయించి దానిపై సుందరాక్షర శోభితంబైన శ్రీ భాగవతంబునిచి యావాహనాది సర్వోపచారంబుల యథావిధి నిర్వహించి సదక్షిణంబుగా వస్త్ర భూషణాంగరాగ గంధపుష్ప మాల్యాది సమర్పితుండైన యాచార్యున కొసంగిన భవబంధ విముక్తుండై ప్రవిమలావ్యయ నిత్యనిరవద్య బ్రహ్మానంద పదంబయిన మోక్ష సామ్రాజ్యంబవశ్యంబుగా సిద్ధించు నీ విధం బెవండనన్య నిర్మల నిష్ఠా గరిష్ఠుండై యొనర్చునో యమ్మహా భాగునకు సకలపాపక్షయంబగు మరియు లోకపావన శ్రీ మహాభాగవత పురాణ సప్తాహసంశ్రవణంబు ఫలప్రదంబగు ధర్మార్థ కామ మోక్షంబులకు త్తమ సాధనంబై యొప్పారు నిక్కువంబు 116

తే. చిరతపోధన నీకెల్ల జెప్పబడియె
నింక నేమేని యడుగుట కిచ్చగింతె

